**Muhammad the Prophet of Islam**
**(Telugu)**

## ఇస్లామ్ ప్రవక్త

# ముహమ్మద్

## (సల్లల్లాహు అలైహి వ సల్లం)


రచన

**ప్రొ. కె. యస్. రామకృష్ణారావు**

అనువాదం

**ఎస్.ఎమ్. మలిక్**

*అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో*

# ఇస్లాం ప్రవక్త ముహమ్మద్

## మొదటి అధ్యాయం

### ప్రారంభం

ముస్లిం చరిత్రకారుల ప్రకారం ముహమ్మద్ అరేబియా ఎడారిలో క్రీ.శ 571 ఏప్రిల్ 20న జన్మించారు. ఆ పేరుకు అర్థం- "అత్యంత ప్రశంసనీయుడు" అని. నా దృష్టిలో ఆయన అరేబియా పుత్రుల్లోకెల్లా అత్యంత మేధాసంపన్నుడు. ఆయన అడుగుపెట్టనలవికాని ఎర్ర ఇసుక ఎడారిలో ఆయనకు పూర్వం ఆయన తరువాత పుట్టిన కవులు, రాజులందరికన్నా ప్రముఖమయినవాడు.

అయిన ఆవిర్భవించినపుడు అరేబియా నేల ఓ ఎడారి- శూన్యం. ఆ శూన్య ఎడారిలోనుంచి శక్తివంతమయిన ముహమ్మద్ ఆత్మబలం ఓ కొత్త ప్రపంచాన్ని సృజించింది. అది ఓ కొత్త జీవితం, కొత్త సంస్కృతి, ఓ కొత్త నాగరికత, ఓ కొత్త రాజ్యం- మొరాకో నుండి భారత భూభాగం వరకు విస్తరించిన రాజ్యం. అదంతా ఆసియా, ఆఫ్రికా, ఐరోపా మూడు ఖండాలలో ఆలోచనా విధానాన్ని, జీవితాన్ని లోతుగా ప్రభావితం చేసింది.

### అవగాహన నేటి అవసరం

నేను ముహమ్మద్ ప్రవక్తను గురించి వ్రాయాలని అనుకున్నప్పుడు కాస్త జంకాను. ఎందుకంటే అది నేను అవలంబించని ధర్మాన్ని గురించి వ్రాయడమన్నమాట.◆ అందువల్ల అది ఎంతో సున్నితమయిన విషయం కూడా. అనేక మంది అనేక మతాలు అవలంబించే వారుంటారు. ఒక్కో మతంలో విభిన్న

---

◆ *రచయిత హిందూ మతావలంబీకుడు.*

దృక్పథాలు, పంథాలు అనుసరించే వారుంటారు. కొందరు మతం పూర్తిగా వ్యక్తిగత విషయమని ఎంతగా చెప్పినా గోచర అగోచర ప్రపంచాన్నంతటినీ ఆవరించే గుణం దానికి లేదనిమటుకు చెప్పడం అసాధ్యం. అది ఒక్కోసారి మన హృదయాలను, ఆంతర్యాలను, మనస్సుల్ని చేతనావస్థని, అచేతనావస్థని, ఉపచేతనావస్థని, అన్నింటినీ ఆక్రమించుకుంటుంది. ఇంకా మన గతం, వర్తమానం, భవిష్యత్తులు అన్నీ మృదువైన, సున్నితమయిన, కోమలమయిన పట్టుదారంతో వ్రేలాడుతున్నాయన్న గట్టినమ్మకం ఏర్పడినప్పుడు ఈ సమస్య అనేక రెట్లు ఉదృతమయిపోతుంది. ఇక మనం అత్యంత సున్నిత మనస్కుల మయితేనా, ఉద్రిక్తత మరీ తీవ్రమైపోతుంది. దాని దృష్ట్యా ఇతరుల మతం గురించి ఎంత తక్కువగా మాట్లాడితే అంత మంచిదేమో అనిపిస్తుంది. మన మతాలు, మన పెదాల దృఢమైన సీలు బంధనాల్లో, మన హృదయాంత రాళాల లోతుల్లో మరుగున పడి అడుగంటి పోనిద్దాం మరి.

## మనిషి సాంఘిక జీవి

అయితే ఈ సమస్యలో గమనార్హమైన మరో విషయం ఉంది. మనిషి సమాజంలోనే నివసిస్తాడు- మన జీవితాలు అనేకమంది ఇతరుల జీవితాలతో ముడిపడి ఉన్నాయి. అది మనకు ఇష్టమయినా, కాకపోయినా, ప్రత్యక్షంగా నయినా, పరోక్షంగానయినా మనమందరం ఒకే నేలన పండిన ఆహారాన్ని భుజిస్తాము. ఒకే సెలయేటి నీటిని త్రాగుతాము. ఒకే వాతావరణం లోని గాలిని పీల్చుతాము. మనందరం మన సొంత అభిప్రాయాలను కలిగి ఉన్నప్పటికీ మన పొరుగున ఉండేవారి ఆలోచనలు ఎలా సాగుతాయో, వారి ఆచరణకు ముఖ్య మయిన మూలాధారాలేవో కొంతవరకయినా తెలుసుకోవడం ఉత్తమం. దాని వల్ల మరేమీ కాకపోయినా మన చుట్టు ప్రక్కలా వాతావరణంలో సానుకూలత పెంపొందించడానికి అది సహాయపడుతుంది. ఈ కోణంతో చూస్తే మనలో ప్రతివ్యక్తి ప్రపంచంలోని అన్ని మతాలను వాటి సరయిన రూపంలో తెలుసుకోవ డానికి ప్రయత్నించడం ఎంతైనా అభిలషణీయం అని బోధపడుతుంది. తద్వారా పరస్పర అవగాహనకు, మనకు దగ్గర, దూరపు పరిసరాలను ఉత్తమరీతిలో తెలుసుకోవడానికి మార్గమేర్పడుతుంది.

పైగా, మన భావాలు పైకి కనిపించే విధంగా విభిన్నమయినవి కావు. ప్రపంచంలోని గొప్ప మతాల రూపంలోనూ, సజీవ విశ్వాసాల రూపంలోనూ కొన్ని కేంద్ర బిందువుల చుట్టూ ప్రస్ఫుటంగా ప్రోగయి ఉన్నాయి. ఈ మతాలు పుడమిపై నివసించే కోటానుకోట్ల ప్రజల జీవితాలకు మార్గం చూపుతాయి. ప్రేరక శక్తిగా పనిచేస్తాయి. ఎప్పటికైనా ప్రపంచ పౌరులుగా మనం మనగలగాలన్న ఆదర్శమే మన కళ్ళెదుట ఉంటే, మానవాళిని నడుపుతున్న తాత్విక భావాలను గొప్ప మతాలను గురించి తెలుసుకోవడానికి కృషి చెయ్యడం ఓ విధంగా మన విధి అవుతుంది.

## మహా ప్రవక్త- ఓ చారిత్రక వ్యక్తిత్వం

మౌలికంగా ఈ మాటలు నిజమే అయినప్పటికీ, మత క్షేత్రంలో నేల ఎంత జారుడుగా ఉంటుందంటే అక్కడ కాలుబెట్టిన వ్యక్తి అనునిత్యం-దేవతలు కూడా ప్రవేశించడానికి వెనుకాడేచోట దూసుకుపోవాలని ప్రయత్నించే బుద్ధిహీనులు గుర్తుకు వస్తారు. మరో కోణంతో చూస్తే అది ఎంతో చిక్కుతో కూడుకున్న విషయం. నా ఈ రచనకు మూల విషయం చారిత్రక సత్యమయిన ఓ మతం, దాని విశ్వాసాలు, చారిత్రక వ్యక్తిత్వమయిన దాని ప్రవక్త. ఎంతో దురుసయిన ఇస్లాం విమర్శకుడు సర్ విలియం మ్యూర్ దివ్యఖుర్‌ఆన్‌ని గురించి వ్రాస్తూ "ప్రపంచంలో 12 శతాబ్దాలుగా[1] ఏమాత్రం మారకుండా స్వచ్ఛంగా నిలిచిన గ్రంథం ఇది తప్ప మరొకటి బహుశ ఏదీ లేదు" అన్నాడు. నేను మరోమాట కూడా అంటాను. మహాప్రవక్త ముహమ్మద్ ఓ చారిత్రక వ్యక్తికూడా అని[2]. ఆయన జీవితంలోని ప్రతి సంఘటన అత్యంత జాగ్రత్తగా గ్రంథస్థం అయింది. అతి స్వల్పమయిన, సూక్ష్మమయిన విషయాలుకూడా భద్రంగా, పొల్లుపోకుండా పొందుపరచబడ్డాయి. సరయిన సమాచారం సేకరించడానికి ఎవరూ అంతులేని అన్వేషణ జరపవలసిన అవసరం లేదు. సత్యధాన్యం సేకరించడానికి పెద్దపెద్ద రాసుల తూర్పారాపట్టి పొట్టును, తాలును ఏరివేసే కష్టసాధ్యమైన పని కూడా లేదు.

*1. ఇప్పటికి 14 శతాబ్దాలు;*

*2. మత సంబంధమైన వ్యక్తుల్లోకెల్లా అత్యంతరూఢమైన చారిత్రక వ్యక్తి అంటుంది ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా.*

## గతంలోని అపభ్రంశలు

నా పని ఇంకా కాస్త తేలికయింది. ఎందువల్లనంటే ఇస్లాం విమర్శకులు దాన్ని తప్పుగా ప్రజల ముందుకు తీసుకు వచ్చే రోజులకు కాలం చెల్లిపోయింది.[1] రాజకీయ కారణాలు లేక మరే కారణాల వల్లనయినా సరే.

ప్రొఫెసర్ బీలెన్ Cambridge Mediaeual History అన్న పుస్తకంలో ఇలా వ్రాశాడు: "ముహమ్మద్‌ని గురించి, ఇస్లాంను గురించి యూరపులో 19వ శతాబ్ది ప్రారంభంలో ప్రచురించిన వివరాలన్నీ నేడు కేవలం సాహితీ ఉత్సుకతతో వ్రాసినవిగా మాత్రమే భావించవలసి ఉంటుంది." ఒక వ్యక్తికి సంబంధించిన ఈ రచన చెయ్యడంలో నేడు సులభతరమవడానికి కారణం సామాన్యంగా ఇలాంటి చరిత్ర మాత్రమే మనకు నేడు మూలాధారం కాదు. ఇస్లాంను మనం ఎంతగా అపార్థాలపాలు చేశామో చెప్పుకోవలసిన అవసరం నేడు అంతగా లేదు.

ఉదాహరణకు 'ఇస్లాం-కరవాలం' అన్న సిద్ధాంతం మనకు నేడు చెప్పుకోదగ్గ ఏ పరిశోధనా వర్గంలోనూ వినరావడంలేదు. నేడు ఇస్లాం ప్రతి పాదించే సిద్ధాంతం- 'మత విషయంలో ఎలాంటి బలత్కారం లేదు' అన్నది అందరికీ బాగా తెలిసినదే. ప్రపంచ ప్రఖ్యాత చరిత్రవేత్త గిబ్బన్ ఇలా వ్రాశాడు: "సకల మతాలను కరవాలం బలంతో అంతమొందించాలన్న విధిని, వినాశకర మయిన ఓ నమ్మకాన్ని ముహమ్మదీయుల[2] పై రుద్దారు" ఈ అజ్ఞానపు నింద, మోసపూరితమైన అపవాదు దివ్యఖుర్‌ఆన్ ద్వారాను, ముస్లిం విజేతల చరిత్ర ద్వారాను, క్రైస్తవ ఆరాధకుల పట్ల వారు కనబరచిన చట్టవరమైన, బహిరంగ సహనం ద్వారాను ఖండించబడింది. ముహమ్మద్ జీవితంలో ఎదురయిన గొప్ప విషయం కేవలం నైతిక బలం ద్వారా మాత్రమే సాధ్యమయింది. కత్తిదెబ్బ ఒక్కటీ లేకుండా.

---

1. *ఈ వ్యక్తి (ముహమ్మద్) చుట్టూ పేరుకుపోయిన అబద్ధాలు మనకే తలవంపులు తెచ్చేవిధంగా ఉన్నాయి. (థామస్ కార్లయిల్)*
2. *ముహమ్మదీయులంటే రచయిత ఉద్దేశ్యం ముస్లిములని. 'ముహమ్మదీయుల'న్న పదం ప్రవక్త ముహమ్మద్ ఆరాధకులు అన్న భావాన్ని స్ఫురింవ చెయ్యవచ్చు. కాని నిజానికి ఏ ముస్లిము దైవప్రవక్తను దైవంగా ఎన్నడూ పూజించలేదు.*

## రెండవ అధ్యాయం

# ముస్తఫా ఎన్నుకోబడిన వారు

**"తమ కోపాన్ని ఉపశమింపజేసుకునే వారు" (దివ్యఖుర్ఆన్ 3:134)**

అరబ్బులు- ఓ తెగకు చెందిన ఓ ఒంటె మరో తెగకు చెందిన మేత భూమిలో దారి తప్పిపోయి మేసినందుకు నలభయ్యేళ్ళవరకు పోరాడే అరబ్బులు ఇరువర్గాలవారు తమలోని 70,000 మంది అసువులు బాసినంతవరకు పోరాడిన ఘనులు. తమ రెండు తెగలూ నశిసిపొయ్యే పరిస్థితులు కొని తెచ్చుకున్న పెద్దలు. అలాంటి అగ్నిహోత్రులయిన అరబ్బులకు ఇస్లాం ప్రవక్త ఆత్మనిగ్రహాన్ని ప్రబోధించారు. సుశిక్షితులుగా చేశారు. కడకు వారు రణరంగంలోనూ ఆరాధన జరిపేవారుగా మారారు.

## ఆత్మరక్షణకు యుద్ధాలు

సర్దుబాట్లు సంధికై చేసిన అనేక ప్రయత్నాలు పూర్తిగా విఫలమయి నప్పుడు, గత్యంతరం లేని పరిస్థితులు ఆయన్ని ఆత్మరక్షణకై రణభూమిలోకి తీసుకువెళ్ళినప్పుడు ఇస్లాం ప్రవక్త యుద్ధరంగం స్వరూపాన్నే పూర్తిగా మార్చి వేశాడు. ఆయన జీవితకాలంలో అరేబియా ద్వీపకల్పం అంతా ఆయన పాలన లోకి వచ్చేసింది. అయితే ఆ కాలంలో జరిగిన పోరులన్నింటిలోను హతులైనవారి సంఖ్య మొత్తం కొన్ని వందలను మించలేదు. బర్బరులయిన అరబ్బులకు ఆయన ఆరాధించడం నేర్పాడు. వ్యక్తిగతంగా కాదు సామూహి కంగా ఆరాధిం చడం, సర్వశక్తి మాన్యుడయిన దైవాన్ని ఆరాధించడం, సమర సందోహంలోనూ, ధూళిదుమారంలోనూ! ఆరాధనా సమయం వచ్చినప్పుడల్లా- అది ప్రతిరోజు అయిదుమార్లు వస్తుంది. సామూహిక ఆరాధన మానుకోవడానికి వీల్లేదు, కనీసం వాయిదా వెయ్యడానికి సాధ్యపడదు. కొంతమంది శత్రువుల్ని ఎదుర్కొంటూ ఉండగా కొందరు దైవం సమక్షంలో తలవంచి ఆరాధనలో నిమగ్నులవ్వాలి. ఒకరి ప్రార్థన ముగియగానే ఇరువర్గాలు తమ తమ స్థానాలు మార్చుకోవాలి.

## యుద్ధమైదానం మానవీకరణ

రాక్షసత్వం విలయతాండవమాడిన కాలంలో స్వయంగా రణభూమికే మానవత నేర్పాడాయన. మాయోపాయం కూడదని, వంచనకు పాల్పడరాదని, విశ్వాసభంగం చెయ్యరాదని, చిత్రవధకు ఒడిగట్టరాదని, ప్రాజ్ఞతకు చేరని బాలల్ని, స్త్రీలను, వృద్ధుల్ని చంపరాదని, ఖర్జూరపు చెట్లును, ఫలాలనిచ్చే చెట్లను నరకడమో, కాల్చడమో చెయ్యరాదని, ఆరాధనల్లో నిమగ్నులయి ఉన్న స్త్రీ పురుషుల ఏకాగ్రతను భంగపరచరాదని కఠినమయిన ఆదేశాలు జారీ చేశాడాయన. స్వయంగా ఆయన తన ప్రాణశత్రువుల ఎడల అవలంబించిన వైఖరి ఆయన అనుయాయులకు ఉత్తమ ఆదర్శంగా నిలిచింది. మక్కాను జయించిన సందర్భంలో ఆయన తన అధికార ఆరోహణలో ఉన్నత శిఖరాల నందుకున్నాడు. తననూ, తన అనుయాయుల్ని తీవ్రంగా బాధపెట్టిన నగరం, తననూ తనవారినీ స్వస్థలం నుండి పారదోలిన నగరం, తాను 200 మైళ్ళ దూరం వలసవెళ్ళి తలదాచుకున్నా వదలకుండా నిరంతరం బాధించి బహిష్కరించిన నగరం- ఆ మహానగరం నేడు తన పాదాలక్రింద చేరింది. యుద్ధ నియమానుసారం, ఆయన తనకూ, తన అనుయాయులకు ఎదురయిన క్రూర కృత్యాలన్నింటికీ ప్రతీకారం తీర్చుకోదలిస్తే న్యాయంగా తీర్చుకోగలిగేవాడే. కాని తన వైరులపట్ల ఎలా ప్రవర్తించాడా పవిత్రమూర్తి! ముహమ్మద్ అంతర్యం ప్రేమానురాగాలతో, కరుణానుగ్రహాలతో ఉప్పొంగింది. ఆయన ఇలా ప్రకటించాడు: "నేడు మీపై ఎలాంటి నింద, ప్రతీకారం లేదు. మీ అందరికీ నేడు విముక్తి నిచ్చాము."

## ప్రాణ శత్రువులకు క్షమాపణ

ఆత్మరక్షణకై పోరాటాన్ని అనుమతించడానికి ఇది ప్రధానలక్ష్యం. మానవుల్ని ఏకం చెయ్యడం. ఈ లక్ష్యం నెరవేరగానే ఆయన తన పరమ శత్రువుల్ని సయితం మన్నించి వేశాడు. తన ప్రియమయిన బాబాయి హమ్‌జాను చంపి ఆయన కళేబరాన్ని ఖండ ఖండాలుగా ఖండించి, దాన్ని చీల్చి కాలేయంలోని ఓ ముక్కను తీసి నమిలిన వారినీ క్షమించాడు.

## ఆచరణతో సమ్మిళితం సిద్ధాంతం

ముహమ్మద్ ప్రకటించిన విశ్వజనీన సోదరత్వ సిద్ధాంతం, మానవ ఏకత్వపు భావన, మానవాళి సామాజిక ప్రగతి కొరకు ఆయన అందజేసిన గొప్ప వరప్రసాదాలు. ఈ ధర్మాలను ప్రపంచంలోని గొప్ప మతాలన్నీ బోధించాయి. కాని ఇస్లాం ప్రవక్త ఈ సిద్ధాంతాలను వాస్తవ ఆచరణలో పెట్టారు. అయితే దాని విలువను మానవాళి బహుశ ఇకపైనే గుర్తించగలుగుతుంది. అంత ర్జాతీయతా స్ఫూర్తి పూర్తిగా జాగృతమయినప్పుడు, జాతి తత్వదురభిమానాలు దూరమయి నప్పుడు, పటిష్టమయిన మానవ సౌభ్రాత్రభావన ఉనికిలోకి వచ్చినప్పుడు, దీనికి గుర్తింపు లభిస్తుంది.

## దేవుని సమక్షంలో రైతయినా రాజయినా సమానులే

సరోజిని నాయుడు ఇస్లాంలోని ఈ కోణాన్ని గురించి చెబుతూ ఇలా అంటున్నారు. "ప్రజాస్వామిక వ్యవస్థను ఆదేశించడమే కాక ఆచరించి చూపిన తొలి ధర్మం అదే. మస్జిద్‌లో అజాన్ (ప్రార్థనకు పిలిచే ముస్లిముల విధానం) పలకగానే ఆరాధకులందరూ వచ్చి చేరినప్పుడు, రైతూ రాజు ప్రక్కప్రక్కనే దైవం సమక్షంలో మోకరిల్లి 'దేవుడే గొప్పవాడు' అని ప్రకటించినప్పుడు ఇస్లాంలోని ప్రజాస్వామిక విధానం ప్రజల్లో రోజుకు అయిదుసార్లు మూర్తీభవించి దర్శన మిస్తుంది." ఇంకా ఆ భారతీయ మహాకవయిత్రి ఇలా అన్నారు, "ఇస్లాం ప్రబోధించే ఈ అభేద్యమయిన ఏకతను చూసి అనేకమార్లు ప్రభావితురాలి నయ్యాను. దీని ద్వారా మనుషులు అంతఃప్రేరణరీత్యానే సోదరులుగా రూపొందుతారు. మీరు ఇంగ్లాండులో ఓ ఇజిప్షియన్‌ని, ఓ అల్జేరియన్‌ని, ఓ భారతీయుణ్ణి, ఓ తుర్కీ దేశస్థుణ్ణి కలుసుకున్నప్పుడు వారి మధ్య ఏదయినా చెప్పుకోదగ్గ విషయముంటే అది- ఒకని మాతృభూమి ఈజిప్ట్ అవడం, మరొకనిది భారతదేశం అవడం ఒక్కటే (ఇతరత్రా మరే విభేదమూ కానరాదు).

## ఇస్లాం- స్పెయిన్‌ని నాగరికంగా మార్చింది నేటి సామాజిక సమస్యలకు అదే సరయిన పరిష్కారం కూడా

మహాత్మాగాంధీ తన నిరుపమానమయిన శైలిలో ఇలా అన్నారు,"ఎవరో అన్నారు, దక్షిణాఫ్రికాలోని యురోపియన్లు ఇస్లాం విజృంభణ పట్ల భయపడు తున్నారని- ఇస్లాం స్పెయిన్‌కు నాగరికత నేర్పింది. ఇస్లామ్ జ్ఞానజ్యోతిని మొరాక్కోకు తీసుకువెళ్ళింది. మానవ సోదరత్వపు శుభవార్తను ప్రపంచానికి అందజేసింది. దక్షిణాఫ్రికాలోని యురోపియన్లు ఇస్లాం వ్యాప్తికి భయపడు తున్నారంటే దానికి అర్థముంది. అప్పుడు దక్షిణాఫ్రికన్లు తెల్లజాతుల వారితో సమానత్వాన్ని కాంక్షిస్తారు. వారు భయపడవలసిందే. ఒకవేళ మానవ సోదరత్వం పాపమయితే, వారు భయపడేది నల్లవారిలో సమానతను అయినట్లయితే- అప్పుడు వారి భయం నిరాధారమయింది కాదు."

## హజ్ యాత్ర- సజీవసాక్ష్యం

ప్రతి సంవత్సరం యాత్రాకాలంలో ప్రపంచం ఇస్లాం ప్రదర్శించే వింత యిన దృశ్యాన్ని తిలకిస్తుంది. అందులో జాతి, వర్గం, వర్ణంలాంటి తారతమ్యా లన్నిటిని సమానస్థాయిలోకి తెస్తుంది ఇస్లాం. కేవలం యురోపియన్లే కాదు, ఆఫ్రికన్లు, పర్షియన్లు, ఇండియన్లు, చైనీయులు అందరూ మక్కాలో ఒకేచోట ఒకే ఆధ్యాత్మిక కుటుంబ సభ్యుల్లా కలుసుకుంటారు. అందరూ ఒకే మాదిరి దుస్తుల్లో అగుపిస్తారు. ప్రతివ్యక్తి అతుకుల్లేని రెండు తెల్లని బట్టముక్కల్లో ఉంటాడు. ఒకటి నడుముకు చుట్టుకుంటాడు, మరొకటి భుజాలపై పరుచు కుంటాడు. ఆచ్ఛాదనలేని తలతో ఎలాంటి ఆర్భాటం ఉత్సవ సంబరాలు లేకుండా, **"వచ్చేశాను ప్రభూ, వచ్చేశాను. నీ ఆదేశం మేరకే వచ్చాను. సహవర్తులు లేని స్వామీ వచ్చేశాను."** అక్కడ ఉన్నతుడెవడో, అల్పుడెవడో వేరు చేసేందుకు ఏ అంశమూ మిగలదు. అక్కడి నుండి యాత్ర ముగించుకు వెళ్ళే ప్రతి యాత్రికుడు తన ఇంటికి ఇస్లాంలోని అంతర్జాతీయ ప్రాముఖ్యతా ప్రభా వాన్ని తీసుకుపోతాడు.

ప్రొఫెసర్ హర్‌గ్రోంజె మాటల్లో చెప్పాలంటే, "ఇస్లాం ప్రవక్త స్థాపించిన జాతుల సంఘం, అంతర్జాతీయ ఐక్యత, మానవ సౌభ్రాతృతల సూత్రాలను విశ్వ జనీనమయిన ప్రాతివదికలపై నెలకొల్పింది. అది ఇతర జాతులన్నింటికీ మార్గదర్శకం" ఇంకా ఆయన ఇలా అన్నాడు, "వాస్తవమేమంటే, విభిన్న జాతుల సంఘాన్ని ఏర్పరిచే లక్ష్యసాధనలో ఇస్లాం చేసిన కృషికి సమానంగా ప్రపంచం లోని ఏ జాతి కృషి చేసి చూపలేదు."

## దూరమవుతున్న ప్రపంచానికి ఇస్లాం- ఓ ఆశ్రయం

ఇస్లాం ప్రవక్త ప్రజాస్వామిక రాజ్యాన్ని దాని ఉత్తమరూపంలో నెలకొలి పారు. ఖలీఫాలు (ప్రాతినిధ్య పాలకులు) అయిన ఉమర్, అలీ (ప్రవక్త అల్లుడు) మన్సూర్, అబ్బాస్, (మామూన్ కుమారుడు) ఇంకా ఇతర అనేక ఖలీఫాలు, రాజులు తమ కాలపు న్యాయమూర్తుల సమక్షంలో సాధారణ మనుషుల్లా ఇస్లామీయ న్యాయస్థానాల్లో నిల్చోవలసి వచ్చింది. అయితే నేటికీ నాగరికు లయిన తెల్లజాతివారు నల్లజాతివారి పట్ల ఎలా ప్రవర్తిస్తారో మనకు తెలియనిది కాదు. ఒక్కసారి నేటికి 14 శతాబ్దులకు పూర్వం ఇస్లాం ప్రవక్త కాలంలో నీగ్రో (నల్లజాతి) బానిస అయిన 'బిలాల్'ని గురించి కాస్త ఆలోచిం చండి. ముస్లి ములను ప్రార్థనకు పిలిచే బాధ్యతను ఇస్లాం ప్రారంభకాలంలో ఎంతో గౌరవప్రద మయినదిగా పరిగణించేవారు. ఆ బాధ్యత ఈ నీగ్రో బానిసకు అప్పగించ బడింది. మక్కా విజయం తరువాత దైవప్రవక్త ఆయన్ని నమాజుకై పిలుపు నివ్వమని ఆదేశించారు. అప్పుడు ఆ నీగ్రో బానిస తన నల్లరంగు లావుపాటి మొరటు పెదాలతో పవిత్ర 'కాబా' గృహం కప్పుపైకి ఎక్కి నిలబడ్డారు. 'కాబా' ఇస్లామీయ ప్రపంచంలో అత్యంత పవిత్రమయింది, చారిత్రకమయింది. ఆ దృశ్యాన్ని చూసి కొందరు గర్విష్టులయిన అరబ్బులు "ఈ నల్ల నీగ్రో బానిస పాడుగాను ఇతను కాబా కప్పునెక్కి ప్రార్థనకై పిలుపునిస్తున్నాడు చూడండి" అని వాపోయారు.

ఈ గర్వం, ద్వేషం కూడుకున్న ఏడ్పును సమాధానపరచడానికా అన్నట్టు దైవప్రవక్త ఓ ప్రసంగం చేశారు. ఈ రెండు దుర్గుణాలను రూపుమాపాలన్నదే ఆయన ఉద్దేశ్యం.

"మనం అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకోవాలి. ఆయన మిమ్మల్ని అజ్ఞానకాలపు చెడులనుండి, అహంకారాల నుండి రక్షించాడు. జనులారా గుర్తుంచుకోండి, మనుషులంతా రెండు వర్గాలుగానే విడిపోయ్యారు. నిష్ఠా పరులు, భయభక్తులు కలవారు; వీరు అల్లాహ్ దృష్టిలో గౌరవప్రదమయిన స్థానం గలవారు. అత్యాచారులు, కఠిన హృదయులు వీరు అల్లాహ్ దృష్టిలో అల్పమయిన వారు, శిక్షార్హులు. ఇంతే తప్ప మనుషులంతా ఆదమ్ సంతానమే. ఆదమ్‌ను అల్లాహ్ మట్టితో పుట్టించాడు."

దాన్నే ఖుర్ఆన్ క్రింది విధంగా ధృవీకరించింది.

మానవులారా, నిస్సందేహంగా మేమే
(సర్వశక్తి మాన్యుడయిన దైవమే) మిమ్మల్నందరినీ
ఒకే స్త్రీపురుషుల జంట ద్వారా సృజించింది.
మేమే మిమ్మల్ని జాతులుగా తెగలుగా రూపొందించాము.
మీరు ఒకరినొకరు గుర్తించుకోవాలని
(ఒకరినొకరు ద్వేషించుకోవాలని కాదు)
నిస్సందేహంగా దేవుని దృష్టిలో
మీలో ఉత్తమమయిన వాడు
మీలో అత్యంత భయభక్తులు కలవాడే. (దివ్యఖుర్ఆన్ 49:13)

## అసాధారణ రూపాంతరీకరణ

ఈ విధంగా ఇస్లాం ప్రవక్త మహాద్భుతమయిన రూపాంతరీకరణను సాధించారు. జన్మతః ఎంతో ఉన్నతులయిన కులీనులయిన అరబ్బులు సయితం ఈ నీగ్రో బానిసకు తమ కూతుళ్ళను పెళ్ళిచేసి ఇవ్వడానికి సిద్ధమయ్యారు. ఖలీఫా ఉమర్, చరిత్రలో 'ఉమర్ ది గ్రేట్' అని ప్రస్తావించబడే ఉమర్, ఈ నీగ్రో బానిసను చూసినప్పుడల్లా ఆదరంతో నిలబడి 'మా సర్దారు వచ్చారు, మా యజమాని వచ్చారు' అంటూ స్వాగతం పలికేవారు. ఖుర్ఆన్, మహనీయ ముహమ్మద్ అరబ్బుల్లో తెచ్చిన మార్పు ఎంత మహత్తరమయింది.

ఆ కాలంలో అరబ్బులకంటే గర్విష్ఠులయిన ప్రజలు పుడమిపైనే లేరని చెప్పవచ్చు. అందుకే జర్మన్ మహాకవి 'గోథె' దివ్యఖుర్‌ఆన్‌ని గురించి ప్రస్తావిస్తూ ఇలా చెప్పకుండా ఉండలేకపోయాడు: " ఈ గ్రంథం తరతరాల వరకు ప్రజలపై ఉధృతమయిన ప్రభావం వేస్తూపోతుంది." జార్జి బెర్నార్డ్ షా కూడా ఈ కారణంగానే ఇలా అన్నాడు: "రాబోయే 100 ఏళ్ళల్లో ఇంగ్లాండునే కాదు యూరపును సైతం పరిపాలించగల శక్తి ఏ మతానికయినా ఉంటే అది ఇస్లాం ఒక్కటే."

## ఇస్లాం స్త్రీలను సముద్ధరించింది

స్త్రీని పురుష బంధాలనుండి పైకి లేవనెత్తింది ఇస్లాంలోని ఆ ప్రజాస్వామిక తత్వమే. సర్ ఛార్లెస్ ఎడ్వర్డ్ ఆర్చిబాల్డ్ హెమిల్ టన్ ఇలా అంటున్నాడు "మనిషిలో సహజంగానే అంతర్లీనమయి ఉన్న పాపరాహిత్యాన్ని గురించి ఇస్లామ్ ప్రబోధిస్తుంది. దాని బోధనల ప్రకారం స్త్రీ పురుషులిరువురూ ఒకే మూలంనుంచి ఆవిర్భవించారు. ఇద్దరిలో ఉన్నది ఒకే ఆత్మ. ఇద్దరూ బుద్ధిజ్ఞానాలు, ఆధ్యాత్మికతా నైతికతలకు సంబంధించిన సమానమయిన శక్తి సామర్థ్యాలు కలిగి ఉన్నారు."

## స్త్రీకి ఆస్తి హక్కు ఉంది

అరబ్బులు, ఆయుధాలు ధరించి రణరంగంలో దిగగలవారే పిత్రార్జితమైన ఆస్తికి హక్కుదారులన్న సంప్రదాయాన్ని గట్టిగా నమ్మేవారు. ఇస్లాం ఆవిర్భవించి అది బలహీనులయిన స్త్రీజాతిని రక్షించేందుకు ముందుకు వచ్చింది. స్త్రీలకు తమ తల్లిదండ్రుల ఆస్తిలో వాటా పొందే హక్కునిచ్చింది. అయినప్పటికీ ఆ తరువాత 12 శతాబ్దులకు 1881 లోగాని ప్రజాస్వామ్యానికి పుట్టినిల్లుగా చెప్పుకునే ఇంగ్లాండులో ఇస్లాం ప్రవేశపెట్టిన ఈ వ్యవస్థను అరువు తెచ్చుకోవడం జరిగింది. 'వివాహిత స్త్రీల చట్టం' అన్న చట్టాన్ని నిర్మించడం జరిగింది. కాని శతాబ్దులకు పూర్వం ఇస్లాం ప్రవక్త చేసిన ప్రకటనలివి: "స్త్రీలు పురుషులకు రెండు సగభాగాల్లాంటి వారు, స్త్రీల హక్కులు పవిత్రమైనవి స్త్రీలు తమకు ప్రాప్తమయిన హక్కుల ప్రకారం జీవించేలా చూడండి."

# మూడవ అధ్యాయం

# అల్ అమీన్
# విశ్వసనీయుడు

## సువర్ణ సాధనం

ఇస్లాం మానవుని రాజకీయ, ఆర్థిక వ్యవస్థలను ప్రత్యక్షంగా స్పర్శించదు. పరోక్షంగానే చర్చిస్తుంది- అదీ, రాజకీయ అర్థిక వ్యవహారాలు మానవ జీవన సరళిని ప్రభావితం చేసే మేరకే అది చర్చిస్తుంది. అది ఆర్థిక జీవితానికి సంబంధించిన కొన్ని అతి ముఖ్యమయిన సూత్రాలను ప్రతిపాదిస్తుంది. ప్రొఫెసర్ మాసిగ్నాడ్ ప్రకారం, ఇస్లాం రెండు విరుద్ధమయిన అతిశయాల మధ్య సంతులనాన్ని ఏర్పరుస్తుంది. ఇంకా నాగరికతకు పునాది కాగల శీల నిర్మాణాన్ని దృష్టిలో ఉంచుకుంటుంది. దీన్ని వారసత్వపు చట్టం ద్వారాను, వ్యవస్థీ కృతమయిన (స్వచ్ఛందమయినది కాదు) జకాత్ అనబడే దాన విధానం ద్వారాను పటిష్ట పరచడం జరిగింది. ఇంకా దీన్ని ఆర్థిక రంగంలో సమాజ విరుద్ధమయిన సకల పద్ధతుల్ని నిషేధించడం ద్వారానూ భద్రపరచడం జరిగింది- గుత్తాధిపత్యం, వడ్డీ, అర్జన కాని నిర్ణీత ఆదాయాలు, అదనపురాబడి, అక్రమనిల్వలు, ధరలు పెంచడానికి కృత్రిమంగా నిత్యావసర వస్తువుల్లో దేన్నయినా మార్కెట్ నుండి మాయం చేయడం; జూదం ఇత్యాది వాటిని నిషేధించడం జరిగింది. పాఠశాలలు, ఆరాధనాలయాలు, ఆసుపత్రులు ఇత్యాది వాటికి విరాళాలివ్వడం, బావులు త్రవ్వించడం, అనాధ శరణాలయాలు ప్రారంభించడం, అత్యుత్తమ సత్కార్యాలుగా పరిగణించబడ్డాయి. ఇస్లాం ప్రవక్త బోధనల ప్రభావంతో తొలిసారిగా అనాధాలయాలు ఉనికిలోకి వచ్చాయని చెబుతారు. అంటే ప్రపంచంలోని అనాధాలయాలకు, అనాధగా పుట్టిన ప్రవక్తకు ప్రపంచమంతా ఋణపడి ఉందన్నమాట. కార్లయిల్ మాటల్లో "ప్రకృతి తనయుడైన ఈ పిచ్చి

తండ్రి అంతర్యంలో స్థానమేర్పరచుకున్న మానవత, సమానత, భయభక్తులు నిండిన సహజవాణిని వినిపిస్తున్నాయి ఈ ఉత్తమ కార్యాలన్నీ!"

## పరీక్ష

ఓ చరిత్రకారుడు ఒకసారి గొప్పవ్యక్తిని నిర్ధారించడానికి మూడు పరీక్షలు ప్రతిపాదించాడు.

1. అతని సమకాలీనులు అతని సత్యతను గుర్తించారా?
2. తన సమకాలీన ప్రమాణాలకు అతీతంగా ఎదగగల ఉన్నతుడా?
3. అతను ప్రపంచం కొరకు శాశ్వతమయిన ఏదయినా వారసత్వం వదిలాడా?

ఈ పట్టికను ఇంకా పొడిగించవచ్చు. అయితే మహనీయ ముహమ్మద్ విషయంలో ఈ మూడు పరీక్షలు ఉత్తమోత్తమరీతిలో సంతృప్తినిస్తాయి. చివరి రెండు అంశాలకు సంబంధించిన కొన్ని ప్రస్తావనలు ముందే వచ్చాయి. మొదటిది అంటే- ఇస్లాం ప్రవక్త ముహమ్మద్ తన సమకాలీనుల చేత తన సత్యతను నిరూపించుకున్నాడా?

## అనుపమ వ్యక్తిత్వం

ముహమ్మద్ సమకాలీనులు ఆయన మిత్రులయినా, శత్రువులయినా ఆయనలోని ఉత్తమ గుణాలను, మచ్చలేని నిజాయితీని, ఉన్నతమయిన మంచితనాన్ని, పరమ నిస్వార్థతను, చిత్తశుద్ధిని గుర్తించారు. ఈ గుణగణాలను ఆయన జీవితమంతటా ఆచరణా పరిధులన్నింటిలోనూ కానగలిగారు. ఆయన నికార్సయిన నిష్పాక్షికత కారణంగా యూదులు ఆయన సందేశాన్ని నమ్మనివారు సయితం ఆయన్ని తమ వ్యక్తిగత తగాదాల్లోనూ మధ్యవర్తిగా ఒప్పుకొనేవారు. ఆయన సందేశాన్ని నమ్మనివారు సైతం ఆయన్ని నిందించలేకపోయారు "ఓ ముహమ్మద్ మేము నిన్ను అబద్ధం పలికేవాడని చెప్పము. కాని మేము నీకు ఉద్గ్రంథాన్ని ఇచ్చి సందేశం ఇచ్చి పంపినవాణ్ణి (దైవాన్ని) తిరస్కరిస్తున్నాము." వారు ఆయనపై ఏదైనా ఆవహించిందని అనుకున్నారు. ఆయన్ని నయం

చేయడానికి సకల విధాలా కృషి చేశారు. కాని వారిలోని ఉత్తములు ఆయనపై ఓ కొత్త కాంతి ఉదయించిందని గ్రహించారు. వారు తద్వారా జ్ఞానజ్యోతిని పొంద డానికి తాపత్రయపడ్డారు. ఇస్లాం ప్రవక్త చరిత్రలో చాలా ముఖ్యమయిన గమనించదగ్గ విషయం ఏమిటంటే ఆయన దగ్గరి బంధువులు, ఆయన ప్రియ మయిన బాబాయి కొడుకు, ఆప్తమిత్రులు, ఆయన్ని బాగా ఎరిగినవారు ఆయన అందజేసే సందేశాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకున్నారు. ఆయన అందజేసే దైవవాణిలోని స్వచ్ఛతను, సత్యతను దృఢంగా నమ్మారు. గెలిలీకు చెందిన మత్స్యకారులకు విద్యలో ఏమాత్రం తీసిపోని ఉత్తములు వివేచనాపరులయిన ఈ స్త్రీ పురుషులు తమ బోధకుడిలో ఏ మాత్రమయినా ఐహిక లాలస, వంచన, విశ్వాసలేమిని కనుగొని ఉంటే ముహమ్మద్ చేయదలచుకున్న నైతిక పున రుజ్జీవనం, సాంఘిక సంస్కరణ ఒక్క క్షణం కూడా నిలువక నేలకూలి ధూళిలో కలసిపోయేవి (సయ్యద్ అమీర్ అలి రచించిన The Spirit of Islam నుండి).

దీనికి విరుద్ధంగా మనకు కనిపించేదేమంటే, ఆయన అనుయాయులు ఆయన్ని స్వచ్ఛందంగా తమ జీవితం మొత్తానిగ్గాను నాయకుడిగా ఎన్నుకునేంత గాఢంగా ప్రేమించారు. ఆయన కోసం వారు ఎడతెగని ప్రమాదాలను, బహిష్క రణల్ని ఎదుర్కొన్నారు. వారు దుర్భరమయిన బాధల్ని అనుభవిస్తూ, గుండెలు బద్దలు చేసే మనోవేదనల్ని భరిస్తూ, పీడనల్ని యాతనల్ని ఎదుర్కొంటూ ఆయన్ని విశ్వసించారు. ఆయనపై భారంమోపారు, ఆయన విధేయతను పాటించారు, ఆయన్ని గౌరవించారు-జీవిత పర్యంతం ఇదే వారి వైఖరి వారు తమ నాయ కునిలో ఏకాస్త దోషం చూసినా ఇది సాధ్యమయ్యేదా?

## దివ్య ప్రవక్తకై అమర ప్రేమ

ప్రారంభంలో ఇస్లాం స్వీకరించిన వారి జీవిత చరిత్రనొకసారి చదవండి. అమాయక స్త్రీ పురుషుల పట్ల జరిగిన క్రూర అఘాయిత్యాలను చూస్తే హృద యమే ద్రవీభవిస్తుంది. 'సుమయ్యా' అనే ఓ అమాయక స్త్రీమూర్తిలోకి బల్లెం గ్రుచ్చి అమానుషంగా ఆమెని చిత్రవధ చేశారు. 'యాసిర్' పాదాలను ఒంటెల కాళ్ళకు కట్టి దాన్ని పరుగు తీయిస్తారు. 'ఖబ్బాబ్ బిన్ అర్త్'ని మండే నిప్పుకణాల

సజ్జపై పరుండబెట్టి కదలకుండా అతని గుండెపై మృగ ప్రాయులయిన దౌర్జన్య పరులు కాళ్ళు నిలుపుతారు. అతని చర్మం చిట్లి క్రొవ్వు ద్రవమయి ఆ నిప్పు కణాలు కూడా ఆరిపోతాయి. 'ఖబ్బాబ్ బిన్ అబి'ని చిత్రవధ చేస్తారు. అతని శరీరం నుండి కండరాలు క్రూరంగా కోస్తారు. శరీరాన్ని దారుణంగా ఖండ ఖండాలుగా నరికి తుదముట్టిస్తారు. వ్యధాభరితమయిన ఈ దౌర్జన్యకాండ జరుపుతూ- 'నీకిప్పుడు ఏమనిపిస్తోంది? నీ స్థానంలో ముహమ్మద్ ఉండి నీవు నీ పిల్లాజెల్లాతో పాటు నీ ఇంట్లో ఉంటే బావుండేదనిపించడం లేదా? అని అడుగుతారు దుర్మార్గులు. అతను బాధతో కేకవేస్తాడు. తాను తనను, తన కుటుంబాన్ని, తన సంతానాన్ని, తన సర్వస్వాన్ని ధారపోయడానికి సిద్ధమే కాని ముహమ్మద్‌కు ఓ ముల్లు గుచ్చుకోవడం కూడా సహించలేనని బదులిస్తాడు. గుండెలవిసివేసే సంఘటనలిలాంటివి అసంఖ్యాకంగా ప్రస్తావించ వచ్చు. అయితే ఈ సంఘటనలు చాటేదేమిటి? ఇస్లాంను ఆశ్రయించిన ఈ స్త్రీ పురుషులు తమ ప్రవక్త సమక్షంలో స్వయం సమర్పణ చేసుకోవడమేగాక, తమ శరీరాన్ని, మనసును, ఆత్మనుకూడా ఆయన ముందు కానుకలుగా సమర్పించు కోవడానికి కారణం ఏమిటి? ముహమ్మద్ సహచరుల్లో ఆయనపై గల ఈ అచంచల విశ్వాసం, ఆయనపై ఈ ప్రగాఢ ప్రేమ ఏమిటి? ఆయనలోని చిత్త శుద్ధికి తనకు అప్పగించిన లక్ష్యసాధనలో ఆయన విలీనానికి ఇది ఉత్తమమైన తార్కాణం కాదా?

## ఉత్కృష్ట ప్రతిభావంతులయిన సహచరులు

దైవ ప్రవక్త అనుయాయులయిన వీరంతా అధమస్థాయిగలవారు, అల్పమయిన మేధాశక్తిగలవారు ఏమాత్రం కాదు. ప్రారంభంలో ఆయన చుట్టూ చేరినవారిలో, మక్కాలోని ఉత్తమయిన వారు, వికసిత పుష్పాల్లాంటివారు, నవనీతంలాంటి వారు, మంచిస్థాయి, పెద్దరికం ఉన్నవారు, సంపదా సంస్కా రాల రీత్యా గొప్పవారు ఉన్నారు; స్వయంగా ఆయన వంశంలోని వారు, ఆయన జీవితాన్ని లోపలి నుండి వెలుపలి నుండి క్షుణ్ణంగా ఎరిగిన వారున్నారు.

ఆయన తరువాత ఖలీఫాలయిన నలుగురు మహనీయులూ, ఆ మహోన్నత పురుషులు ఆ తొలినాటి అనుయాయులే.

ఎన్సైక్లోపీడియా బ్రిటానికా అంటూంది: "ముహమ్మద్ సమస్త ప్రవక్తల్లోనూ, ధార్మిక వ్యక్తిత్వాల్లోనూ అత్యంత విజయవంతులైనవారు." కాని ఆయనకు ప్రాప్తించిన ఈ విజయం కేవలం యాదృచ్ఛికం కాదు, అదేదో గాలి వాటానికి వచ్చిపడిన విజయశ్రీ కాదు. ఆయన సత్యతను ఆయన సమకాలీనులు గుర్తించిన దాని ఫలితం ఆయన ప్రశంసనీయమయిన, అందరినీ సమ్మోహితులు చేసిన వ్యక్తిత్వానికి ఫలితం.

# నాల్గవ అధ్యాయం

# అస్సాదిక్

# సత్య సంధుడు

## మానవ జీవితానికి పరిపూర్ణ ఆదర్శం

ముహమ్మద్ వ్యక్తిత్వాన్ని అందులోని మర్మాలను పూర్తిగా అర్థం చేసుకోవాలంటే కష్టసాధ్యం. దాన్ని కేవలం ఓ స్థూల దృశ్యంలో మటుకే చూడగలను నేను. ఎంత రమ్యమయిన దృశ్యాలో ఎంత నాటకీయంగా అన్నీ కదలాడుతున్నాయి.అదో ప్రవక్త ముహమ్మద్, ఇదో యోధుడు ముహమ్మద్, అదో వ్యాపారి ముహమ్మద్, ఇదో రాజకీయవేత్త ముహమ్మద్, ఇదో గొప్ప వక్త ముహమ్మద్, ఈయన సంస్కర్త ముహమ్మద్, ఆయన అనాథల ఆశ్రయం ముహమ్మద్, ఈయన బానిసల అండ ముహమ్మద్, ఇదిగో స్త్రీల రక్షకుడు ముహమ్మద్, అదో న్యాయమూర్తి ముహమ్మద్, ఇదో సాధుమూర్తి ముహమ్మద్ ఈ మహత్తరమైన పాత్రలన్నింటిలోనూ, మానవ జీవితపు ఈ రంగాలన్నిటిలోనూ ఆయన ఓ హీరోలా ఓ నాయకునిలా దర్శనమిస్తాడు.

అనాథత్వం అన్నది అసహాయతకు పరాకాష్ఠ అనవచ్చు. భువిలో ఆయన జీవితం ఓ అనాథగానే ప్రారంభమయింది. రాచరికం అన్నది భౌతిక శక్తికి, అధికారాలకు పరాకాష్ఠ అనవచ్చు. ఆయన జీవితం అందులోనే అంతమయింది. ఓ అనాథ బాలుని నుండి, బహిష్కృత శరణార్థిగా, అక్కడినుండి ఆధ్యాత్మికంగాను, భౌతికంగానూ సర్వసత్తాక ప్రభువుగా ఆయన రూపాంతరం చెందాడు. ఆయన ఓ జాతి మొత్తానికి దాని భవితవ్య నిర్ణేతగా మారాడు. ఈ పయనంలో దాని పరీక్షలూ, ప్రలోభాలు, అందులోని స్తబ్ధతలు, మార్పులు, అందులో వెలుగులూ, చీకట్లు, దాని ఎగుళ్ళుదిగుళ్ళు దాని భయోత్పాతం వైభవాలు అన్నీ చవిచూశాడు. ఆయన ప్రపంచం పెట్టిన అగ్ని పరీక్షలో నెగ్గుకువచ్చాడు. ఓ

మచ్చకూడా లేకుండా బయటపడ్డాడు. మానవ జీవితపు ప్రతిరంగంలోనూ ఆదర్శవంతంగా మిగిలాడు. ఆయన సాధించినవి జీవితపు ఏదో ఒక్క పరిధికి పరిమితం కావు. మానవ జీవితపు సకల అవసరాలను, స్థితుల్ని అవన్నీ ఆవరించి ఉన్నాయి

## ముహమ్మద్ (స.అ.సం)- పరమోన్నతుడు

గొప్పదనమన్నది పశుత్వంలో మునిగితేలే, నైతిక అంధకారంలో, కొట్టుమిట్టాడే ఓ జాతిని సముద్ధరించడంలో ఇమిడి ఉంటే, అరబ్బుల్లాంటి అథః పాతాళానికి అణిగిపోయిన ఓ జాతి మొత్తాన్ని పైకి లేవనెత్తి చక్కదిద్ది, వారు నాగరికతకు, విజ్ఞానానికి, ధ్వజవాహకులుగా మార్చగలిగిన వ్యక్తిత్వమే ఆ గొప్పదనానికి అర్హమైనది. గొప్పదనమన్నది సమాజంలోని పరస్పరం కలహించు కునే వర్గాలను సోదరత్వపు బంధాలతోను, ఉదారమైన దాతృత్వ స్వభావంతోను ఏకం చేయడంలో ఉన్నట్లయితే ఎడారి ప్రవక్త ఈ ప్రత్యేకతకు సర్వవిధాల తగినవాడు. నీచమయిన మూఢనమ్మకాల్లో పడిపోయిన వారిని, నీతి బాహ్య మయిన అన్ని రకాల ఆచారాలకు బానిసలయిన వారిని సంస్కరించడంలో గొప్పదనమంటూ ఉంటే ఇస్లాం ప్రవక్త కోటాను కోట్ల ప్రజల హృదయాల్లో నుంచి మూఢ నమ్మకాలను తుడిచి వేశాడు. నిర్హేతుకమయిన భయాలను పార ద్రోలాడు. ఉన్నత నైతిక ప్రమాణాలను కనబరచడంలోనే మహత్తు ఉన్నట్లయితే ముహమ్మద్‌ని ఆయన మిత్రులూ, శత్రువులూ 'అల్ అమీన్' అనీ 'అస్ సాదిక్' అనీ- విశ్వసనీయుడు, సత్యసంధుడు అని ఒప్పుకున్నారు. విజేతనే గొప్పవాడని అనే మాటయితే ఈయన ఓ నిస్సహాయ అనాథ బాలుడు, అతిసాధారణ మనిషి స్థాయినుండి మొత్తం అరేబియా పాలకునిగా ఖుస్రో, సీజర్‌లకు సమానుడుగా, ఈ 14 శతాబ్దుల కాలం గట్టిగా నిలిచిన మహాసామ్రాజ్య స్థాపకుడుగా ఎదిగాడు. ప్రజల ప్రేమాదరణలే నాయకుని గొప్పదనానికి ప్రమాణాలని భావిస్తే ప్రవక్త పేరు నేడు కూడా ప్రపంచంతటా వ్యాపించిన కోటానుకోట్ల హృదయాలలో మహాద్భుతమైన ఆకర్షణను, ఉత్తేజాన్ని కలిగిస్తుంది.

## నిరక్షరాసి అయిన ప్రవక్త

ఆయన ఎథెన్సులోనో, రోము పర్షియాలోనో, ఇండియా చైనాలోనో విశ్వ విద్యాలయాల్లో తత్వశాస్త్రాన్ని చదువలేదు. అయినా మానవతకు శాశ్వత మూల్యాలు గల అత్యున్నత సత్యాలను గురించి చర్చించాడు. స్వయంగా నిరక్షరాసి అయిన ఆయన అనర్గళంగా, భావస్ఫూర్తితో మాట్లాడితే మనుషులు చలించి కళ్ళు ద్రవించాయి. అనాథగా జన్మించి ఏ ప్రాపంచిక సామగ్రి లేకుండా పోయినా ఆయన అందరి ప్రేమకు పాత్రుడయ్యాడు. ఆయన ఏ సైనిక పాఠశాలలోను చదువలేదు, అయినా జఠిలమయిన అవాంతరాల మధ్య ఆయన తన సేనల్ని సమీకరించి తాను అదుపు చెయ్యగలిగిన నైతిక శక్తుల ద్వారా విజయాలను సాధించాడు. మేధా సంపన్నులయిన ప్రతిభాశాలురు బోధకులవడం చాలా అరుదు. డిస్కార్టెస్ (Discortes) పరిపూర్ణ బోధకుడుగా ప్రపంచంలోని ఎంతో అరుదయిన వాళ్ళలో ఒకడు. హిట్లర్ తన గ్రంథం 'మై కాంప్'లో ఈ భావాన్నే ప్రస్ఫుటం చేశాడు. అతను ఇలా అంటున్నాడు. "గొప్ప సైద్ధాంతికుడు ఎన్నడూ గొప్పనాయకుడు కాలేడు. అతనికి బదులుగా ఓ నిరసనాపరునిలో ఈ గుణాలు మెండుగా ఉంటాయి. అతనే మంచి నాయకుడిగా రాణించగలుగుతాడు. ఎందువల్లనంటే నాయకత్వం అంటే మానవ సమూహాలను నడిపించగలగటమే. నాయకత్వపు సామర్థ్యం ఆలోచనల సృజనల మధ్య సామాన్యమయిన అంశం ఏదీలేదు." కాని ఆయనే తిరిగి ఇలా అన్నాడు: "సైద్ధాంతికుడు, వ్యవస్థాపకుడు నాయకుడుగా ఒకే వ్యక్తి అలరారడం ధరిత్రిలో అరుదయిన సంభావన. ఇందులోనే గొప్పదనముంది" ఇస్లాం ప్రవక్తలో ఈ ధరిత్రిలోని అరుదయిన సంభావనను రక్తమాంసాల మానవాకారంలో సంచరిస్తూ ఉండగా ప్రపంచం కళ్ళారా కానగలిగింది.

"నిరుపేదవాడు, కష్టపడేవాడు, కడుపునిండా దొరకని వాడు, చుట్టూ ఉన్న అనాగరిక జనం దేనికై పాటు పడుతుందో లక్ష్యపెట్టనివాడు. ఇంతచేసీ పెద్దమనిషి మటుకు కాడు. ఆయనలో ఏవిధమయిన తృష్ణగాని లేదు- దానికి మించినదేదో ఆయనలో ప్రత్యేకం. లేకపోతే ఆ అనాగరిక అరబ్బుజనం ఆయన చేతి క్రింద ఇరువై మూడేండ్ల పాటు పోరాడుతూ బాధలనుభవిస్తూ, ఆయనతో

సతతం సన్నిహిత సంబంధాలు కలిగి ఉండి ఆయన పట్ల ఆ అద్భుతరీతిలో గౌరవాదరణలు కలిగి ఉండేవారు కారు.

"వారు అనాగరికులు, అనునిత్యం జగడాలకు కాలు దువ్వేవారు. వారది ప్రమాదకరమైన నిజాయితీతో చేసేవారు. అలాంటి వారిని అదుపు ఆజ్ఞల్లో ఉంచగలగాలంటే సామర్థ్యం, ఔచితీ, మగసిరి లేనిదే సాధ్యపడదు. వారాయన్ని ప్రవక్త అని పిలిచారు. ఎందుకో తెలుసా? ఆయన వారి సమక్షంలోనే జీవించాడు. బహిరంగంగా ఎలాంటి మాయమర్మాల తెరలు కప్పుకోకుండా చిరిగిన తన బట్టల్ని తానే కుట్టుకుంటూ తన చెప్పులు తానే బాగు చేసుకుంటూ, పోరాటాల్లో పాల్గొంటూ, సంప్రతింపులు జరుపుతూ, ఆదేశాలు జారీ చేస్తూ వారి మధ్యనే అగుపించాడు. ఆయన ఎలాంటి మనిషో వారు గమనించే ఉంటారు. ఆయన్ని ఏమని పిలిచినా పట్టుపీతాంబరాలు ధరించిన మణిమాణిక్యాల కిరీటధారి పట్ల కూడా స్వయంగా కుట్టుకున్న బట్టలు తొడిగిన ఈ మనిషి మాదిరిగా ప్రజలు విధేయత పాటించి ఉండరు.

"ఇరువై మూడేళ్ళ కఠినాతి కఠినమైన అసలు పరీక్షకు తగిన వ్యక్తిగా, అనుపమయోధునిగా, ఆయన్ని నేను తిలకించాను."

(Heroes and Hero Worship (corlyl))

రెవరెండ్ బాస్వర్థ్స్మిత్ సూచించినట్లు ఇది ఎంతో వింతయిన విషయం. ఓ రాజ్యానికి అధిపతిగాను, ధర్మపీఠానికి అధిపతిగాను, ఆయన తనలోనే ఓ సీజరు, ఓ పోపు అని చెప్పవచ్చు. ఆయన పోపే కాని పోపులాంటి పటాటోపం లేదు. ఆయన సీజరే కాని సీజర్ లాంటి వైభవం లేదు. స్థాయి సైన్యం లేదు. అంగరక్షకుడు లేడు. రక్షకభట దళమూ లేదు. ఖజానా లేదు. ప్రపంచంలో ఎవరైనా నిజమైన దైవిక అధికారంతో పరిపాలించారని చెబితే అది ముహమ్మద్ మాత్రమే. ఆయనకు అన్ని అధికారాలూ ఉండేవి. కాని ఆ అధికారాలకు ఆలంబనలేవీ ఉండేవికావు. ఆయన అధికారపు డంబాచారాలను ఖాతరు చెయ్యలేదు. ఆయన వ్యక్తిగత జీవితంలోని నిరాడంబరత ఆయన ప్రజాజీవితం లోని సాధారణతను ప్రతిబింబిస్తూ ఉండేది.

## ముహమ్మద్ (సఅసం)- మచ్చలేని స్వచ్ఛమయిన జీవితం

మక్కా విజయం తరువాత దాదాపు 10 లక్షల చదరపు మైళ్ళ వైశాల్యం గల భూభాగం ఆయన పాదాక్రాంతమయింది. ఆ అరేబియా అధినేత తన సొంత చెప్పుల్ని తానే బాగు చేసుకున్నాడు; తన బట్టల్ని తానే కుట్టుకున్నాడు; మేకల పాలు పిండాడు; తన పొయ్యి తానే శుభ్రం చేసుకుని రాజేసుకున్నాడు; ఇంకా ఇతర అల్పమయిన ఇంటి పనులెన్నో చేశాడు. ఆయన జీవిత కాలంలోనే చివరన ఆయన నివసించిన మదీనా మహానగరమంతా ఐశ్వర్యంతో తుల తూగుతూ ఉండింది. ఎక్కడ చూచినా వెండి బంగారాలు సమృద్ధిగా కానవచ్చేవి. సౌభాగ్యవంతమైన ఆ కాలంలోనూ ఆయన ఇంట పొయ్యి అనేక వారాలు చల్లగానే పడిఉండేది-ఆయన ఖర్జూరపు పండ్లు తిని, నీళ్ళు త్రాగి కాలం వెళ్ళదీసే వాడు. ఆయన కుటుంబంలో అనేక రాత్రులు ఎడతెగకుండా పస్తులతో పడుకునేవారు. ఆయన పగలంతా పరిశ్రమించి పడుకునేది మెత్తటి పరుపుపై కాదు, ఖర్జూరపు చాపపై. రాత్రిలో అధికభాగం దైవారాధనలో గడిచేది. తరుచుగా తన కర్త సమక్షంలో ఆయన కళ్ళు ధారాపాతంగా కురిసేవి. తన బాధ్యతల్ని నిర్వర్తించేందుకు శక్తినివ్వమని ఆయన ప్రభువును వేడుకుంటూ ఉండేవాడు. ఉల్లేఖనాల ప్రకారం, ఆయన కంఠం దుఃఖం వల్ల పూడుకు పొయ్యేది. పొయ్యి మీద కుండ కుతకుతలాడేలా అనిపించేది. ఆయన మరణించిన నాడు ఆయన ఆస్తి అంతా కొన్ని నాణేలు మాత్రమే. వాటిలో కొన్నింటిని అప్పు తీర్చడానికి, మరికొన్నింటిని ఇంటికి వచ్చి అర్థించిన బీదవారికి ఇవ్వడం జరిగింది. ఆయన తుది శ్వాస వదిలే సమయానికి ఒంటిపై ఉన్న బట్టలకు అసంఖ్యాకమైన అతుకులు! ప్రపంచాన్నంతా వెలుతురు చిమ్మిన ఇంట చిమ్మచీకటి క్రమ్ముకుంది- దీపంలో పొయ్యడానికే ఇంట్లో చమురు లేదు.

## చివరి ఘడియ వరకూ మారని వ్యక్తి

పరిస్థితులు తారుమారయ్యాయిగాని దేవుని అంతిమ ప్రవక్త మారలేదు. జయాపజయాల్లో, అధికారంలోనైనా, అధికారం లేనప్పుడైనా కలిమిలోనైనా, లేమిలోనైనా ఆయన సదా ఒకే విధమయిన మనిషి, ఒకే విధమయిన చరిత్రను

కనబరిచాడు. దేవుని సకల విధానాలు, నియమాల మాదిరిగా దేవుని ప్రవక్తలు కూడా ఎన్నడూ మారరు.

## సర్వోన్నతుడు ముహమ్మద్

గొప్పదయిన లక్ష్యం, స్వల్పమయిన సాధనాలు, ఆశ్చర్యకరమయిన ఫలితాలు మానవ అనమాన ప్రతిభకు గీటురాళ్ళయితే ఆధునిక ప్రపంచపు ఏ గొప్ప వ్యక్తినయినా ముహమ్మద్‌తో పోల్చడానికి ఎవరు సాహసించగలరు?

ప్రపంచంలో ప్రఖ్యాతులయిన వారు ఆయుధాలు సృష్టించారు, చట్టాలు చేశారు, రాజ్యాలు స్థాపించారు. వారు స్థాపించింది ఏమయినప్పటికీ అది భౌతిక శక్తికి సంబంధించినదే. అవి తరుచుగా వాళ్ళ కళ్ళముందే నేల కూలాయి. ఈ వ్యక్తి ముహమ్మద్, సైన్యాల పునాదుల్ని కదిలించడమే కాక, శాసనాలు, రాజ్యాలు, జాతులు, సామ్రాజ్యాలనే కాక లక్షలాది మనుషుల్ని చలించజేశాడు. అన్నింటికంటే ముఖ్యమైన బలిపీఠాలు, దేవతలు, మతాలు, భావాలు, నమ్మకాలు, ఆత్మలు- అన్నింటినీ స్థానభ్రంశం చేశాడు.

ఓ గ్రంథం ఆధారంగా ఆయన ఓ ఆధ్యాత్మిక జాతీయతను రూపొందించాడు. ఆ గ్రంథంలోని ప్రతి అక్షరం ఓ శాసనం అయింది. ఆ జాతిలో అన్ని భాషలవాళ్ళు, అన్ని జాతుల వాళ్ళు, ఏకమై పటిష్టమైన బంధంలో ఇమిడిపొయ్యారు.

దేవుని ఏకత్వపు భావన అనేక రకాల మహా విచిత్రమైన మత భావనల మధ్య ప్రకటించడమే స్వతహాగా ఓ మహాద్భుతంగా పనిచేసింది. ఆయన నోట ఆ మాటలు వెలువడడమే తడువుగా అక్కడి మూఢనమ్మకాలన్నీ తుడిచిపెట్టుకుపొయ్యాయి.

ఆయన నిరంతర ప్రార్థనలు, దైవంతో ఆయన చేసిన మార్మిక .... సంభాషణ, ఆయన మరణం, మరణం తరువాత ఆయన (ఉద్యమం) సాధించిన విజయాలు -ఇవన్నీ ఓ వంచకుడు కాదని నిరూపిస్తున్నాయి. ఇవి ఓ దృఢ విశ్వాసం ఆధారంగా, ఓ సిద్ధాంతాన్ని సంస్థాపించే శక్తిని ఆయన పొందినట్లు రూఢీ పరుస్తున్నాయి. ఆ సిద్ధాంతానికి రెండు కోణాలు, ఒకటి దేవుని ఏకత్వం,

రెండవది దేవుని అభౌతికత. మొదటి అంశం దేవుడెలాంటి వాడో చెబితే రెండవది దేవుడు ఏమికాడో చెబుతుంది.

"..... తత్త్వవేత్త, వక్త, ప్రవక్త, శాసనకర్త, యోధుడు, భావాల విజేత, హేతుబద్ధమైన విశ్వాసాల సంస్థాపకుడు, విగ్రహాలు లేని ఆరాధనా బోధకుడు, ఇరువై ప్రాపంచిక సామ్రాజ్యాలు, ఒక ఆధ్యాత్మిక సామ్రాజ్య స్థాపకుడు- అయనే ముహమ్మద్. మానవ ఔన్నత్యాన్ని కొలిచే సకల ప్రమాణాల రీత్యా ఆయన కంటే గొప్పవాడు ఎవడైనాఉన్నాడా అని నేడు ప్రశ్నిస్తే జవాబు లేదు."
(Lamartime, History dela Turquie, Paris 1854, Vol II Pg 276,277)

# అయిదవ అధ్యాయం

# ప్రపంచానికి శాశ్వత వారసత్వం

## ఉత్కృష్ట నిజాయితీ

నిజాయితీపరుడు దేవుని ఉత్తమ సృష్టి అన్నది నానుడి. ముహమ్మద్ నిజాయితీపరుడు అవడం కన్నా గొప్పవాడు. మానవత నరనరాల్లో జీర్ణించుకున్న వ్యక్తి ఆయన. మానవ సహానుభూతి, మానవ ప్రేమ ఆయన అంతర్యంలో ప్రతి ధ్వనించే సంగీతం. మానవసేవ, మానవ ప్రగతి, మానవ పరిశుద్ధత, మానవ జ్ఞానబోధ- ఒక్కమాటలో చెప్పాలంటే మనిషిని మానవునిగా మలచడం ఆయన ఉద్యమ ధ్యేయం, ఆయన జీవిత పరమార్థం. ఆలోచనల్లో, మాటల్లో, చేతల్లో, మానవ శ్రేయమే ఆయన ఏకైక ప్రేరణ, ఆయన మార్గదర్శక సూత్రం.

ఆయన పరిపూర్ణంగా నిరాడంబరుడు, నిస్వార్థపరుడు. ఆయన గ్రహించిన పరిచయనామాలేమిటి? రెండు. దైవసేవకుడు, ఆయన సందేశ హరుడు. సేవకుడు ముందు తరువాత సందేశహరుడు. ఈ ప్రపంచంలోని సకల ప్రాంతాల్లో ఆవిర్భవించిన ప్రవక్తల మాదిరి దైవప్రవక్త, దైవ సందేశహరుడు.

ఆ ప్రవక్తల్లో కొందరు మనకు తెలిసినవారు, ఇంకా అనేక మంది మనకు తెలియని వారు. ఈ సత్యాలను లేదా వాటిలో ఏదో ఒక దాన్నయినా ఎవరయినా నమ్మకపోతే అతను ముస్లింకాలేడు. ఇది ముస్లిములందరికీ ఓ విశ్వాసాంశం.

**"ఆ కాలపు పరిస్థితుల్ని చూడండి. ఆయన అనుయాయుల గౌరవా దరణల్ని చూడండి; ముహమ్మద్ చేసిన మహా గొప్ప అద్భుతమేమిటంటే ఆయన తనకు అద్భుతాలు చేసే ఏ శక్తి ఉన్నట్టు ప్రకటించలేదు."** అని వ్రాశాడో పాశ్చాత్య రచయిత. అద్భుతాలు జరిగాయి. కాని అది ఆయన బోధనల ప్రచారా నికి కాదు. వాటిని కేవలం దైవానికి ఆపాదించి ఆయన అనుపమానమయిన విధానాలను సూచించడానికే ప్రదర్శించడం జరిగింది. ఆయన అతిసాధారణంగా తాను ఇతరులవలె ఓ మనిషినే అని ప్రకటించేవాడు. ఆయన వద్ద భూమ్యా

కాశాల ఏ ఖజానా లేదు. భవిష్యత్తు గర్భంలో దాగి ఉన్నదేదో తనకు తెలిసినట్టుకూడా ఆయన ప్రకటించలేదు. ఇదంతా అద్భుతాలు సర్వసామాన్యమని భావించే కాలంలోని మాటలు. సాధారణ సాధువులు కూడా అతి సునాయాసంగా అద్భుతాలు చేసి చూపెడుతున్న కాలమది. అరేబియాలోనూ, దాని అవతలనూ వాతావరణమంతా ప్రకృతికి అతీతమయిన మహత్యాలతో వేడెక్కిన కాలమది.

## సశాస్త్రీయమయిన ప్రాతిపదిక- ముహమ్మద్ అందించిన వారసత్వమే

ఆయన తన అనుయాయుల్ని ప్రకృతిని, ప్రకృతి ధర్మాలను అధ్యయనం చెయ్యమని, అవగతం చేసుకోమని, దైవిక మహత్తును గుర్తించమని, ప్రస్తుతించమని బోధించాడు. దివ్యఖుర్ఆన్ ఇలా అంటోంది.

**"మేము (సర్వోన్నత ప్రభువు, దేవుడు) ఆకాశాలను, భూమిని, వాటి మధ్య ఉన్న దాన్నంతటినీ కేవలం ఆటగా (వేళాకోళానికి) సృష్టించలేదు. మేము వాటిని సమంజసమయిన లక్ష్యాల కొరకు తప్ప మరిదేనికీ సృజించలేదు. కాని మానవులు చాలామంది దాన్ని అర్థం చేసుకోవడం లేదు."** (దివ్యఖుర్ఆన్ 44: 38-39)

ఈ ప్రపంచం మాయకాదు, అర్థరహితమూ కాదు. దీన్ని ధర్మం ఆధారంగా సృజించడం జరిగింది. దివ్యఖుర్ఆన్‌లో ప్రకృతిని పరిశీలించి అధ్యయనం చెయ్యడానికి ఆహ్వానించే వచనాలు, ఆరాధనా, ఉపవాసవ్రతం, హజ్ తదితర విషయాలను బోధించే వాటికన్నా ఎన్నో రెట్లు అధికంగా ఉన్నాయి. ఈ బోధనల ఫలితంగా ముస్లిములు ప్రకృతిని ఎంతో శ్రద్ధగా పరిశీలించసాగారు. తద్వారా సశాస్త్రీయ పరిశీలన, పరిశోధనలకు, ప్రయోగాలకు రాచమార్గ మేర్పడింది. అంతవరకు గ్రీకులకు ఆ పద్ధతులు తెలిసినవికావు. ముస్లిము వృక్ష శాస్త్రజ్ఞుడు ఇబ్ను బైతార్ ప్రపంచం నలుమూలల నుంచి చెట్లు, మొక్కలు సేకరించి వృక్షశాస్త్రం గురించి వ్రాశాడు. దాన్ని Mayer తన Gesch der Botanica లో గట్టి పరిశ్రమకు మరువలేని నిదర్శమని పేర్కొన్నాడు. అల్ బెరూనీ నలభయి

సంవత్సరాలపాటు పర్యటించి ఖనిజ సంబంధమయిన నమూనాలను సేకరించాడు. ముస్లిం ఖగోళ శాస్త్రవేత్తలు 12 సంవత్సరాలకు పైగా జరిగే ఖగోళ పరిణామాలను పరిశీలించి వివరించారు. అరిస్టాటిల్ ఒక్కటంటే ఒక్క ప్రయోగం కూడా చెయ్యకుండా భౌతికశాస్త్రాన్ని గురించి వ్రాశాడు. ప్రకృతి గురించి వ్రాసినా, ఎంతో అవలీలగా సరిచూడగల సత్యాన్ని- అంటే మనుషులకు జంతువుల కన్నా అధికంగా పల్లుంటాయన్న విషయాన్ని- కూడా పరిశీలించే శ్రమ తీసుకోకుండానే వ్రాశాడు.

## పాశ్చాత్యులు విజ్ఞాన శాస్త్రం విషయంలో అరబ్బులకు ఋణపడి ఉన్నారు.

'గాలెన్' మానవ శరీర నిర్మాణశాస్త్రంలో గొప్ప ప్రవీణుడు. అతడు క్రింది దవడలో రెండు ఎముకలుంటాయని వ్రాయగా శతాబ్దాల తరబడి దాన్ని అందరూ ఎదిరించకుండా అంగీకరిస్తూవచ్చారు. చివరికి అబ్దుల్ లతీఫ్ అనే ముస్లిం శాస్త్రవేత్త మానవ అస్థిపంజరాన్ని పరీక్షించనంతవరకుగాని అది తప్పు అని తేలలేదు. అనేక ఉదాహరణల్ని ఉటంకించిన తరువాత ప్రఖ్యాత రచయిత Robert Briffalut తన విశ్వ విఖ్యాత గ్రంథం- The Making of Humanity లో ఇలా వ్రాస్తున్నాడు: "మన విజ్ఞానశాస్త్రం విభ్రాంతి గొలిపే ఆవిష్కరణలవల్ల, విప్లవకరమయిన సిద్ధాంతాలవల్ల మాత్రమే అరబ్బులకు రుణపడి లేదు. విజ్ఞాన శాస్త్రం అరబ్బు సంస్కృతికన్నా అసలు తన ఉనికికే రుణపడి ఉంది" ఇంకా ఆయన ఇలా వ్రాస్తున్నాడు: "గ్రీకులు క్రమబద్ధం చేశారు, సర్వసాధారణం చేశారు, సిద్ధాంతీకరించారు, కాని సహనంతో కూడుకున్న పరిశోధన, జ్ఞాన సమీకరణ, శాస్త్రీయ సూక్ష్మ విధానాలు, సవివరమయిన, విస్తృతమయిన పరిశీలనలు, ప్రయోగాత్మక పరిశోధన, ఇవన్నీ గ్రీకులకు సహజంగా తెలియని అంశాలు. నేడు మనం దేన్నయితే విజ్ఞానశాస్త్రం అని అంటున్నామో యూరపులో సరికొత్త పరిశోధనా విధానాలు, ప్రయోగ విధానాలు, పరిశీలనా మార్గాలు, పరిణామ రీతులు, గణితశాస్త్ర వృద్ధి చెందిన రీతుల ఫలితంగా ఏర్పడిందే. ఈ ప్రక్రియలో రూపాలు, గ్రీకులకు ఏమాత్రం తెలియనివి.... ఆ తత్వసారం, ఆ విధానాలు యురోపియన్ జగత్తులో అరబ్బుల ద్వారానే ప్రవేశపెట్టబడ్డాయి".

## ఆరవ అధ్యాయం

# దైవ ప్రవక్త ముహమ్మద్ (సఅసం)

## ఇస్లాం ఓ పరిపూర్ణ జీవన వ్యవస్థ

శాస్త్రీయ ఆలోచనారీతిని ప్రవేశపెట్టిన ప్రవక్త ముహమ్మద్ ప్రబోధాల ఆచరణాత్మకతే రోజు కూలీతో పాటు ప్రాపంచిక వ్యవహారాలన్నింటినీ శాసించింది. దైవం మానవుడిని తనను ఆరాధించడానికే సృష్టించినట్లు చెబుతుంది దివ్య ఖుర్ఆన్. అయితే ఆ ఆరాధనకు భావం వేరు. దైవారాధన అన్నది కేవలం పూజా పురస్కారాలకు పరిమితం కాదు. దైవ సమ్మతి, ప్రసన్నత కోరి, ప్రజాశ్రేయం కొరకు చేసే ప్రతి పని ఆరాధనా పరిధిలో చేరి ఉంది. ఇస్లాం జీవితాన్ని అందులో చేసే కృషి అంతటినీ నిర్దేశిస్తుంది. అయితే ఆ ప్రయత్నాలన్నీ నిజాయితీతో, న్యాయంతో, పరిశుద్ధమయిన సంకల్పాలతో జరగాలి. పవిత్రమయిన వాటికీ ప్రాపంచిక విషయాలకు మధ్య అతి ప్రాచీన కాలంనుండి వస్తున్న తారతమ్యాన్ని ఇస్లాం తుడిచిపెట్టివేసింది. పరిశుద్ధమయింది తిని, దైవానికి కృతజ్ఞతలు అర్పించుకుంటే అది ఆరాధనే అంటుంది దివ్య ఖుర్ఆన్. మనిషి తన భార్య నోటికి అందించే ఓ అన్నం ముద్దకూడా సత్కార్యంగా పరిగణించబడి దైవం చేత దానికి బహుమానం ప్రాప్తమవుతుంది అన్నారు దైవప్రవక్త.

మరో ప్రవచనంలో ఆయన, "ఎవరయితే తన మనోవాంఛల్ని ధర్మ సమ్మతమయిన మార్గాల ద్వారా తీర్చుకుంటాడో అతను కూడా దైవ సన్నిధిలో బహుకృతికి అర్హుడవుతాడు." అక్కడే ఉన్న ఓ వ్యక్తి అడిగాడు, "దైవ ప్రవక్తా అలాంటి వ్యక్తి కేవలం తన కామతృష్ణను తీర్చుకుంటాడు, తనలోని కోరికల్ని నెరవేర్చుకుంటాడు' అని. దానికి ఆయన ఇలా బదులు పలికారు, "అతడు తన కాంక్షల పరిపూర్తికై అధర్మమయిన మార్గాల నవలంబిస్తే, అతనికి శిక్షపడేది. అలాంటప్పుడు సరయిన మార్గాలనవలంబించి నందుకు అతనికి బహుమానం ఎందుకు లభించరాదు?"

మతం అన్నది కేవలం పరలోక సాఫల్యం, అది భౌతిక విషయాలనే కాక ఇహలోక జీవితపు బాగోగులను కూడా అది చర్చించాలన్న ఈ కొత్త మత భావన, నైతిక ప్రమాణాలకు సరికొత్త పునాదుల మార్గం ఏర్పరిచింది. ఇస్లాం ప్రవక్త ప్రబోధాల్లోని విశిష్టత ఏమిటంటే; మానవాళి నిత్యజీవితపు వ్యవహారాల్లో వారి సాధారణ సంబంధాలపై ప్రభావం వెయ్యడం, సామాన్య ప్రజలపై అది శక్తిమంత మయిన పట్టు కలిగి ఉండడం, వారి విధులు, హక్కుల భావనల్ని క్రమబద్ధం చెయ్యడం, పండితులకు, పామరులకు అది సమంగా అనుసర ణీయం, ఆచరణీయం కాగలగడం- ఇవి దాని ముఖ్యాంశాలు.

## దృఢమయిన విశ్వాసాలు, సరయిన ఆచరణలు

ఇక్కడ జాగ్రత్తగా గమనించవలసిన విషయం ఒకటుంది. ఆయన ఇంతగా సత్కార్యాలు చెయ్యమన్నాడంటే సరయిన నమ్మకాలను వదులుకుని కాదు. ప్రపంచంలో విభిన్న ధోరణులున్నాయి. ఒకటి విశ్వాసాలకు ప్రాముఖ్యం ఇచ్చి సత్కార్యాలను గాలికి వదిలేస్తే మరొకటి మంచి పనులకు ప్రాధాన్యత ఇచ్చి సరయిన నమ్మకాలను పట్టించుకోదు. అయితే ఇస్లాం సరయిన విశ్వాసం, ఆచరణల ఆధారంగానే నెలకొంటుంది. అందులో లక్ష్యాలకు ఎంత ప్రాముఖ్య ముందో అంతే ప్రాముఖ్యం సాధనాలకూ ఉంది. అలాగే సాధనాలకు ఎంత ప్రాముఖ్యముందో అంతే ప్రాముఖ్యం లక్ష్యాలకూ ఉంది. అది విభిన్న పదార్థాలు కలిసిన ఓ ఏకత్వం. అందులో అవి సమిష్టిగానే మనగలుగుతాయి. వాటిని వేర్వేరు చేస్తే అవి నాశనమవుతాయి. ఇస్లాంలో విశ్వాసాన్ని ఆచరణతో వేరు చెయ్యలేము. సరయిన జ్ఞానం సరయిన ఆచరణగా రూపొంది సరయిన ఫలితాలను అందజెయ్యాలి. “ఎవరయితే విశ్వసించి మంచి పనులు చేస్తారో వారే స్వర్గప్రవేశం పొందేవారు.” ఈ పదాలు దివ్యఖుర్ఆన్‌లో మాటిమాటికీ వస్తాయి. ఇవి కనీసం యాభై సార్లయినా పునరుక్తమయ్యాయి. ఆలోచించడాన్ని ప్రోత్సహించడం జరిగింది. కాని కేవలం ఆలోచించడం, ఊహల్లో విహరించడం ధ్యేయం కారాదు. కేవలం విశ్వాసం కలిగి ఉండి ఆచరణ శూన్యులయిన వారికి ఇస్లాంలో స్థానంలేదు. విశ్వాసం కలిగివుండి చెడుగా ప్రవర్తించేవారికి ఇస్లాంలో స్థానం లేదు. దైవశాసనం కృషి, పరిశ్రమ శాసనం కేవలం ఆదర్శ సిద్ధాంతం కాదు.

అది మానవులకు శాశ్వత ప్రగతి మార్గాన్ని నిర్దేశిస్తుంది- జ్ఞానం, జ్ఞానం నుండి ఆచరణ, ఆచరణ నుండి ఆత్మ సంతృప్తి.

## దేవుడు- మరేది ఆయనకు సమానం కాజాలదు

అయితే సరయిన ఆచరణ దానంతట అదే ఆవిర్భవించేందుకు తద్వారా పరిపూర్ణ సంతృప్తి ప్రాప్తమవడానికి ఆ సరయిన విశ్వాసం ఏది? ఈ విషయంలో ఇస్లాం బోధించే కేంద్రీయ సిద్ధాంతం దేవుని ఏకత్వం దేవుడు ఒక్కడే తప్ప మరే దైవం లేదు- అనే మూలానికి సకల బోధనలు, ఆచరణలు ఆధారభూతమయి ఉంటాయి. ఆ దైవం కేవలం తన దైవత్వపు ఉనికి రీత్యానే కాదు, తన దైవత్వపు గుణగణాల రీత్యా కూడా విలక్షణమయిన వాడు.

దేవుని గుణగణాల విషయంలోనూ, ఇతర విషయాల మాదిరిగా మధ్యస్థ సిద్ధాంతాన్నే అనుసరిస్తుంది. అది ఓ వైపున దేవుడు నిర్గుణుడనే భావాన్ని కాదంటుంది. మరోవైపున భౌతిక వస్తువులతో ఆయన్ని సమస్థాయిలో నిలబెట్టే భావాన్నీ తిరస్కరిస్తుంది. దివ్యఖుర్ఆన్ ఓ వైపున ఆయనకు సమానమయింది, ఆయనకు పోలినదేదీ లేదని అంటుంది. మరోవైపున ఆయన చూసేవాడని, వినేవాడని, సర్వం తెలిసినవాడని అంటుంది. ఏవిధమయిన కొరతగాని, దోషంగాని లేనివాడని, ఆయన శక్తి న్యాయబద్ధంగా వ్యవహరిస్తుందని ఆయన కరుణామయుడు, కృపాకరుడని అంటుంది. ఆయన అన్నీ కనిపెట్టి ఉండేవాడు. ఈ విధంగా కేవలం ఆయన ఎలాంటి వాడో చెప్పడమే కాదు, ఇస్లాం ఆయన ఎలాంటి వాడు కాడో కూడా విడమర్చి చెప్పింది. అది అతి విశిష్టమయిన భూమిక ఆయన ఒక్కడే, మరెవ్వరూ అన్నింటినీ కనిపెట్టి ఉండేవారు లేరు. ఆయనే చెడిన దాన్ని సరిదిద్దేవాడు, మరెవ్వరూ సరిదిద్దేవారు లేరు. ఆయనే ఏ విధమయిన నష్టం కలిగినా దాన్ని సరిజేసేవాడు. దేవుడు ఒక్కడే తప్ప మరే దైవం లేడు. ఆయన ఏ అక్కరా లేనివాడు, శరీరాల నిర్మాత, ఆత్మల కర్త, తీర్పు దినానికి ప్రభువు. ఒక్క మాటలో చెప్పాలంటే ఖుర్ఆన్ మాటల్లో,

> **(ఇలా) చెప్పివెయ్యండి: "అల్లాహ్ అని పిలవండి లేదా రహ్మాన్ అని పిలవండి. మీరు ఏ పేరుతో ఆయన్ని పిలిచినా సరయినదే, సుందరమయిన అన్ని పేర్లు ఆయనవే" అని. (దివ్య ఖుర్ఆన్ 17:110)**

## సృష్టిలో మానవుని స్థానం

విశ్వంలో మానవుని స్థానం గురించి దివ్య ఖుర్‌ఆన్ ఇలా అంటుంది.

**ఆయనే అల్లాహ్ ఆయన**
**సముద్రాన్ని మీ ఆధీనం చేశాడు-**
**ఆయన ఆనల మేరకు మీరు అందులో మీ నౌకల్ని నడపడానికి,**
**మీరు ఆయన అనుగ్రహమును అందుకోడానికి**
**మీరు కృతజ్ఞతలు తెలుపుకోడానికి**
**ఇంకా ఆయన మీ ఆధీనం చేశాడు ఆయన తరపున-**
**ఆకాశాల్లో ఉన్నదంతను**
**ధరిత్రిలో ఉన్నదంతను**
**జాగ్రత్త! ఇందులో వాస్తవంగా ఆలోచించే వారికి సూచనలున్నాయి.**

**(దివ్య ఖుర్‌ఆన్ 45: 12-13)**

కాని దేవుని విషయంలో దివ్య ఖుర్‌ఆన్ ఇలా అంటుంది.

**ఆయనే (అల్లాహ్) మృత్యువును, జీవితాన్ని సృజించినవాడు; మీలో ఎవరు తమ ఆచరణల రీత్యా ఉత్తమయిన వారో పరీక్షించ డానికి. ఆయనే మహాశక్తి మాన్యుడు, సదా మన్నించేవాడు.**

**(దివ్య ఖుర్‌ఆన్ 67:2)**

ప్రతి మనిషి తనకున్న స్వేచ్ఛను ఎంతో కొంత వాడుకుంటూ ఉన్నప్పటికీ అతను తన ప్రమేయంలేని కొన్ని పరిస్థితుల్లో పుడుతాడు. తన అదుపు లేని మరికొన్ని పరిస్థితుల్లోనే జీవితం కొనసాగిస్తాడు. ఇస్లాం ప్రకారం ఈ విషయంలో దైవం చెప్పేదేమిటంటే, నాకు మంచిదని అనిపించిన పరిస్థితిలో నాకు ఇష్ట మయిన ఏ మనిషినైనా నేను సృష్టిస్తాను. విశ్వవ్యాప్తమయిన ప్రణాళిని నశ్వర మానవుడు పూర్తిగా గ్రహించలేడు. ఇంతకూ నేను కలిమిలోనూ లేమిలోనూ

మిమ్మల్ని పరీక్షిస్తాను. ఆరోగ్య అనారోగ్యాల్లోను, ఉత్థాన పతనాలలోనూ పరీక్షిస్తాను. నా పరీక్షా విధానం మనిషి మనిషికీ మారుతుంది, గంట గంటకూ మారుతుంది. లేమిలో క్రుంగిపోయి అధర్మ మార్గాల్లో పడకండి. ఇది కేవలం మధ్యన వచ్చే సంధికాలం, కలిమిలో నిగ్గి దైవాన్ని మరవకండి. దేవుని వరాలు కేవలం అప్పగింతగా, అమానత్‌గా మాత్రమే ఇవ్వబడుతాయి. మీరు ప్రతినిత్యం పరీక్షలో ఉన్నారు. ప్రతి క్షణం ఓ పరీక్ష. ఈ జీవన రంగంలో ఎందుకు అన్న ప్రశ్నేలేదు. చెయ్యాలి, చావాలి అంతే. జీవించేంత వరకు దైవాదేశాల మేరకు జీవించండి, మరణిస్తే దైవమార్గంలోనే మరణించండి. దీన్ని ఎవరయినా వినాశతత్వం అనవచ్చు. కాని ఈ విధమయిన వినాశతత్వం ఉధృతమయిన కృషికి అనివార్యం. ప్రతినిత్యం మనిషిని జాగృదావస్థలో ఉంచుతుంది. మానవుని మనుగడకు ఐహిక జీవితాన్నే అంతమని భావించరాదు. మృత్యువు తరువాత మరో జీవితం ఉంది. అదే శాశ్వతమయింది. మరణానంతర జీవితం కేవలం మరుగున ఉన్న జీవిత సత్యాన్ని బహిర్గతపరిచే ఓ ద్వారం లాంటిది. మనిషి జీవితంలో చేసే ప్రతీ చర్య అది ఎంత అప్రముఖమయిందయినా శాశ్వతమయిన ప్రభావాన్ని వేస్తుంది. అది సవ్యంగా పొందుపరచబడి వుంది.

## ఇహలోక జీవితం పరలోకానికి తయారి

కొన్ని దైవ విధానాలు మీకు తెలిసినవే, కాని ఆయన విధానాలు అనేకం మీకు తెలియవు. నేడు ఈ లోకంలో ఏవయితే మీ కనుమరుగయి ఉన్నాయో అవన్నీ మరో లోకంలో మీ కనులముందు బహిర్గతమవుతాయి. సజ్జనులయిన వారు అక్కడ మనిషి కనులెప్పుడూ కానని, వీనులెప్పుడూ వినని, మనసుల్లో ఎప్పుడూ తట్టని దైవానుగ్రహాలను పొందుతారు. అక్కడ వారు ఉన్నతోన్నత పరిణామాలనే అధిరోహిస్తారు. ఎవరయితే ఇహలోకంలో లభించిన అవకాశాల్ని వ్యర్థపరచుకొన్నారో వారు, ప్రతి మనిషి తాను చేసుకున్న దాన్ని చవిచూసే అనివార్య సిద్ధాంతాన్ననుసరించి తాము చేజేతుల కొని తెచ్చుకున్న ఆధ్యాత్మిక రోగానికిగాను తగిన శాస్తిననుభవించవలసి ఉంటుంది. జాగ్రత్త! అది

బాధాకరమయిన రోదన, శారీరకమయిన బాధనే హింస అనంటాము. దీన్ని కొంతవరకు ఎలాగయినా భరించవచ్చు. ఆధ్యాత్మిక బాధే నరకం. దాన్ని భరించడమే అసాధ్యం. చెడువైపుకు తీసుకుపొయ్యే అంతర్య ప్రేరణలతో ఈ జీవితంలోనే పోరాడాలి. అప్పుడు అంతరాత్మలోని ఆత్మ విమర్శనచేసే తత్వం జాగృతమవగా 'ఆత్మ' నైతిక పరిపూర్ణతను సాధించేందుకు తహతహ లాడు తుంది. అవిధేయతకు ఎదురు తిరుగుతుంది. అప్పుడు ఆత్మకు అంతిమ దిశ అయిన విశ్రమం సంప్రాప్తమవుతుంది. దైవంతో సంతుష్టిని పొందే దశ అది. ఆయనలోనే పరమానందం, చిదానందం పొందే దశ అది. ఆత్మ ఆ తరువాత తడబడదు. మార్గం తప్పదు. సంఘర్షణా కాలం అంతమయింది. సత్యం విజయవంతమయి అసత్యం అస్త్రసన్యాసం చేస్తుంది. సమస్యలన్నీ అప్పుడు పరిష్కృతమవుతాయి. మనిషిలో అంతర్విభేదాలు తలెత్తవు. దైవేచ్ఛ సమక్షంలో స్వయం సమర్పణా బిందువు చుట్టూ మనిషి వ్యక్తిత్వం సమైక్యమవుతుంది. ఆయన నిర్దేశించిన ధ్యేయానికి మనిషి సంపూర్ణంగా అంకితమయి పోతాడు. అప్పుడు మనిషిలోని సంక్షిప్తమయిఉన్న శక్తులన్నీ విడుదలవుతాయి. ఆత్మకు అప్పుడు శాంతి ప్రాప్తమవుతుంది. దేవుడు అప్పుడు పిలుస్తాడు: "నీ ప్రభువును చేరి సంతుష్టి, సంతృప్తి, విశ్రమం పొందిన ఓ ఆత్మా ఆయన నీ పట్ల ప్రసన్ను డయ్యాడు, నీవూ ఆయన పట్ల ఆనందం చెందు- నా దాసుల్లో చేరిపో. నా స్వర్గంలో ప్రవేశించు."

## మనిషి భవితవ్యం

ఇదే మనిషి అంతిమ లక్ష్యం. ఓ వైపున విశ్వంపై అధీనత సాధించడం, మరోవైపున తన ఆత్మ ప్రభువు సాన్నిధ్యంలో పరమానందాన్ని పొందేలా సాధన చెయ్యడం- తద్వారా తన ప్రభువు తన పట్ల ప్రసన్నుడవటమేగాక తానూ ఆయన పట్ల ఆనంద భరితుడయ్యేలా వ్యవహరించడం. అప్పుడు సంతుష్టి, పరిపూర్ణ సంతుష్టి, సంతృప్తి, పరిపూర్ణ సంతృప్తి, శాంతి, పరిపూర్ణ శాంతి సిద్ధిస్తుంది. దైవ ప్రేమామృతమే ఆ దిశలో ఆహార్యం, జీవజలధారలోని అనంత సాగరాలే

పానీయాలు, దుఃఖం అన్నదిగాని, బాధ అన్నదిగాని, అతన్ని సమీపించవు; విజయం, సాఫల్యం అన్నవి అతన్ని ఎన్నడూ వదలిపోవు.

జీవితపు ఈ తత్వం పట్ల ప్రభావితుడయిన థామస్ కార్లయిల్ ఇలా వ్రాశాడు.

> "ఇదే ఇస్లాం అంటేనూ- మనం దైవానికి స్వయం సమర్పణ చేసుకోవాలి. మనశక్తి అంతా ఆయన సమక్షంలో పరిపూర్ణంగా మనల్ని మనం అర్పించుకోవడంలోనే దాగి ఉంది. ఆయన ఏది చేసినా, ఏది మనకై పంపినా, మృత్యువునయినా దానికంటే హీనమయిందయినా అదే మనకు మేలయింది. అదే మనకు అత్యుత్తమమయింది. దైవానికి మనల్ని మనం పూర్తిగా సమర్పించుకోవాలి" ఇంకా ఆయన ఇలా వ్రాశాడు. "ఇదే ఇస్లాం అయినట్లయితే మనమంతా ఇస్లాంలో జీవించటం లేదా అని గోధ ప్రశ్నించాడు" అంటూ కార్లయిల్ తానే దానికి సమాధానం పలికాడు, "నిజమే. మనలో నైతిక జీవితమున్న ప్రతి ఒక్కరు అలాగే జీవిస్తున్నారు. ఇదే దైవం మనకై- భూవాసులమయిన మనకై పంపిన అత్యున్నతమయిన విజ్ఞత."

ఇంకా కార్లయిల్ ఇలా వ్రాశాడు "అలాంటి వ్యక్తి (ముహమ్మద్) పలికిన వచనం ప్రకృతి హృదయం నుండి ప్రత్యక్షంగా వెలువడిన వాణి. మానవులు దాన్ని వింటారు. తప్పక వినాలి కూడా. మరిదేన్నీ విననంత శ్రద్ధగా దాన్ని వినాలి. దానితో పోల్చిచూస్తే ప్రపంచంలో మరేదయినాసరే అంతా కేవలం శూన్యం."

(Heroes & Hero worship నుండి)

# ముహమ్మద్, ఖుర్ఆన్‌లను గురించి ముస్లిమేతరుల తీర్పు

1. "నేను దైవాన్ని నమ్ముతున్నాను. ముహమ్మద్‌ను ఆయన దూతగానూ విశ్వసిస్తున్నాను" అన్నది అతి సాధారణమయిన ఏకైక సూక్తి ఇస్లాం స్వీకరించ డానికి బుద్ధిగ్రాహ్యమయిన దైవ స్వరూపాన్ని సారూప విగ్రహం ద్వారా కించపరచడమన్నది ఎన్నడూ జరగదు. ప్రవక్తకు ఇచ్చే గౌరవాదరణలు ఉత్తమ మానవ ప్రమాణాలను ఎన్నడూ మించి పోలేదు. ఆయన జీవన విధానాలు, ఆయన అనుయాయుల కృతజ్ఞతా భావాన్ని హేతువుకు ధర్మానికీ ఎన్నడూ అతిక్రమించనివ్వలేదు."

(Edward Gibbon and simon Ockley, History of the saracen Empire, London 1870, p.54)

2. "ముహమ్మద్ దయా స్వరూపుడు. ఆయన ప్రభావాన్ని ఆయన చుట్టూ ఉండేవారు గ్రహించారు, మరెన్నడూ దాన్ని మరవలేకపొయ్యారు.'

(Divan chand sharma, the Prophets of the East, Calcutta 1935, p.122)

3. "జస్టీనియన్ చనిపోయిన నాలుగేళ్ళకు క్రీ.శ. 569లో అరేబియాలోని మక్కాలో ఓ మనిషి జన్మించాడు. ఆయన మానవ జాతిపై ఎంత గొప్ప ప్రభావాన్ని వేశాడు. ఆయనే ముహమ్మద్...'

(John Willian Draper M.D., LL.D., A History of the Intellectual Development of Europe, London 1875, Vol.1, pp. 329-330)

4. "ఒక వ్యక్తి బాహ్యపరమయిన పరిస్థితులు ఎంతో మారగా అతను వాటి కనుగుణంగా తనను తాను మార్చుకోని వ్యక్తి (ముహమ్మద్ తప్ప) మరెవరయినా ఉన్నారా అన్నది అనుమానాస్పదమే."

(R.V.C. Bodley, The Messenger, London 1946, p.9)

5. "ముహమ్మద్ తెచ్చిన సంస్కరణలు స్త్రీజాతి స్థానాన్నే సర్వ సామాన్యంగా మార్చివేశాయన్నది విశ్వవ్యాప్తంగా అంగీకృత విషయం."

(H.A.R. Gibb, Mohammedanism, London 1953, p.33)

6. "ఒక్క సంవత్సర కాలంలోనే ఆయన వాస్తవంగా మదీనాకు ఆధ్యాత్మిక, భౌతిక, నాయకుడు, ఎన్నికయిన పరిపాలకుడయ్యాడు. అప్పటికే ప్రపంచాన్నే ఊపివెయ్యగల యంత్రం ఆయన హస్తగతమయి ఉంది."

(John Austin, "Muhammad the prophet of Allah, in T.P.'s and Cassel's Weekly for 24th September, 1927)

7. బైబిల్ తర్వాత[1] ఇది (దివ్యఖుర్ఆన్) ప్రపంచంలో అత్యంత ఆదరణీయమయిన, అత్యంత శక్తిమంతమయిన ధార్మిక గ్రంథం."

J.Christy Wilson, introducing Islam, New York 1950, p.30)

8. "ఇది ప్రపంచంలో మరే ఇతర గ్రంథం కన్నా అధికంగా చదవబడు తుంది. క్రైస్తవుల బైబిల్ ప్రపంచంలో అత్యధికంగా అమ్ముడు పొయ్యే గ్రంథం కావచ్చు. కాని దాదాపు 25 కోట్ల[2] ముస్లిములు, ముహమ్మద్ అనుయాయులు రోజుకు అయిదు పర్యాయాలు అల్ ఖుర్ఆన్‌ని పారా

---

1. ఇది ఓ క్రైస్తవ విమర్శకుని ద్వారా వస్తున్న ఈ రెండవ స్థానాన్ని మేము ఆక్షేపించబోవటం లేదు.

2. నేడు 100 కోట్లు.

యణం చేస్తారు, పఠిస్తారు. ఇది వారి జీవితాంతం, వారు మాట్లాడడం ప్రారంభించిన కాలం నుండి జీవితంలో ప్రతిరోజు కొనసాగుతుంది."

(Charles Francis Potter. The Faiths Men Live By, Kingswood. Surrey 1955, p.81)

9. "దివ్య ఖుర్ఆన్ ముస్లిముల బైబిల్. మరే ఇతర పవిత్ర గ్రంథంకన్నా అధికంగా ఆదరించబడుతుంది. యూదుల పాత నిబంధనకన్నా, క్రైస్తవుల కొత్త నిబంధనకన్నా అధికంగా గౌరవించబడుతుంది."

J.Shillidy, D.D., The Lord Jesus in the Koran, Surat, 1913.p.111)

10. "సరే. ఒకవేళ ఖుర్ఆన్ ఆయన సొంత రచనే అయితే ఇతరులు కూడా అలా రచించగలరు. అయితే ఎవరయినా సరే అలాంటి పది వచనాలు రచించమనండి. వారలా చెయ్యలేకపోతే (వారు రచించలేరన్నది సుస్పష్టం) వారు ఖుర్ఆన్‌ని అనుపమానమయిన ప్రత్యక్ష మహత్యమని ఒప్పుకోవాలి."

(H.A.R.Gibb, Mohammedanism, London 1953. p. 33)

11. "అందువల్ల ఖుర్ఆన్‌లో ఎలాంటి ప్రక్షిప్తాలకుగాని, పవిత్రమయిన వంచనకుగాని తావు లేకుండా పోయింది. దీనివల్ల ఆ గ్రంథాన్ని ఇతర ప్రముఖ ప్రాచీన గ్రంథాలన్నింటిలో విశిష్టత సంప్రాప్తమవుతుంది. అత్యంత విచిత్ర మయిన విషయం ఏమిటంటే, ఈ నిరక్షరాసి అయిన మనిషి దాని భాషలోనే అత్యుత్తమమయిన గ్రంథాన్ని వ్రాయగలిగాడు."

(Basanta Coomar Bose, Mohammedanism, Calcutta 1931, p.4)

12. ఓ చేతిలో ఖడ్గాన్ని మరో చేతిలో ఖుర్ఆన్‌ని పట్టుకుని ముందుకు సాగే ముస్లిం యోధుని చిత్రం శుద్ధ అవాస్తవం.

(A.S. Tritton, Islam, London 1951, p.21)

13. "మతమౌఢ్యం నిండిన ముస్లిములు తాము జయించిన జాతుల్లో ఇస్లాంని తమ కత్తి మొనతో బలవంతంగా రుద్దుతూ ప్రపంచమంతటా దూసుకుపొయ్యారన్న గాథలు- చరిత్రకారులు మాటి మాటికీ వ్రాసిన నిరాధారమయిన మాయా గాథల్లో అత్యంత విచిత్రమయినవి. ఈ విషయాన్ని చరిత్ర నేడు స్పష్టపరుస్తోంది."

**(De LayO' Leary, Islam at the Crossroads, London 1923, p.8)**